# ఆంధ్రపత్రిక



3|9|2 8|

THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 43. సంచిక 1 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 1-4-1956 Reg. No. M. 5745. 10 పేజీలు 2 అణాలు

# 'బుడమేటి వరద నిరోధానికి మళ్లింపు కాలువ చాలు'

## కాశ్మీరు సమస్యపై భారత విధానం మారినదట

### పాక్ మంత్రి వ్యాఖ్యానం

లాహోరు, మార్చి 30: పాక్ విదేశాంగమంత్రి హమీదుల్ హక్ చౌదరి శ్రీ నెహ్రూ విదేశాంగ విధానంపై చేసిన ప్రకటనపై వ్యాఖ్యానిస్తూ భారతదేశం, కాశ్మీరు విధానాన్ని ఎప్పుడో మార్చుకోవలసిన అవసరం కలుగుతుందనీ అయితే అందుకు కొంత కాలం పట్టవచ్చు అని అన్నారు.

"శ్రీ నెహ్రూ ఇట్లా, వాదించి నంతమాత్రంచేత కాశ్మీర్ ప్రజల హక్కులు మటుమాయం అయిపోవు. భారతదేశంతో ముఖాముఖి సమాలోచనవల్ల ఇది తేలకపోతే పాకిస్తాన్ తిరిగి సమితిదగ్గరకు వెడుతుంది. కాశ్మీర్ ప్రజలకు స్వయం నిర్ణయాధికారాన్ని చేకూర్చే బాధ్యతను పాకిస్తాన్ నెత్తిమీద వేసుకుంది. ఏసమయం వచ్చినప్పుడు ఈ సమస్యను గురించి ఏమిచేయాల్లో దానిని పాకిస్తాన్ చెబుతూవుంటుంది. శ్రీ నెహ్రూ పరిష్కృత్యానికి ఆమోదించనంలేదు. ఎందుచేత? ఆయనకు తెలుసు. నిష్పాక్షికులు ఈవ్యవహారాన్ని పాకిస్తానుకు అనుకూలంగా తేలుస్తారని. అందుచేతనే ఆయన పరిష్కృత్యానికి అంగీకరించడంలేదు" అని శ్రీ హమీదుల్ హక్ అన్నారు.

పాక్ అధ్యక్షుడు ఇస్కందర్ మీర్జా ఇట్లా అన్నారు: నేను శ్రీ నెహ్రూ ప్రసంగాన్ని ఇంకా పరిగాచనలేదు. అయినా పాకిస్తాను వైఖరి మొదటినుంచీ స్పష్టంగానే వుంది."

శ్రీ మీర్జా సరిహద్దు సంఘటనల విషయమై ఇలా అన్నారు: భారత ప్రధాని విటిపై సరియైనసమాచారం అందనం లేదల్లేవుంది. మేము అన్నీ విచారించే అసలువిషయం మాట్లాడుతున్నాము.

మనిలా, బాగ్దాదుకూటాలు పూర్తిగా రక్షణకోసం రష్యా చర్యలకు ఎదురుచర్య వంటివి అని శ్రీ మీర్జా అన్నారు.

పాక్ రేడియో ఈ వర్తమానాన్ని ప్రసారం చేసింది: శ్రీ నెహ్రూ ప్రకటనవల్ల భారతదేశం, పాకిస్తాన్‌లమధ్య తగాదాలు తీరవు. ఉద్రేకాలు ఎక్కువ అవుతాయి. ప్రధానిమంత్రి మహమ్మదాలి ఈ ఉద్రేకాలను తగ్గించాలని ఎంతగానో ప్రయత్నం చేస్తున్నారు. కాని శ్రీ నెహ్రూ పడనీయనంలేదు."

"కరాచీలోని నిష్పాక్షికులైన పరిశీలకులు కాశ్మీర్‌లో జనవాక్యంసంగతి అతి ముఖ్యమైనదంటున్నారు. శ్రీ నెహ్రూ ఆసమస్యను చీపురుతో ఊడ్చినట్టు ఊడ్చేశారు. ఈ రెండు దేశాలమధ్య శాంతి సౌహార్ద్రాలు ఏర్పడాలంటే, జనవాక్యం అవసరంఅని నిష్పాక్షికులు అంటున్నారు" అని ప్రసారం చేసింది.

కరాచీపత్రికలు శ్రీ నెహ్రూ ప్రసంగాన్ని విపరీతమైన శీర్షికలుపెట్టి ప్రకటించాయి.

### పాక్ ప్రధాని భావం

కరాచీ, మార్చి 31: భారత ప్రధానమంత్రి శ్రీ నెహ్రూను చేసిన ప్రకటనవల్ల ఇక కాశ్మీర్ విషయమై ముఖాముఖి సమాలోచనలకు ఏమీ తావు లేకుండా పోతున్నదని పాక్ ప్రధాని చౌదరి మహమ్మదాలీ పార్లమెంటులో వివరించారు.

కాశ్మీర్‌పై శ్రీ నెహ్రూ చేసిన వాదం అంతా అర్థరహితంగా సందర్భశూన్యంగా వున్నదని అన్నారు.

ప్రతిపక్ష నాయకుడు శ్రీ సుహ్రవర్దీకూడా ఇదేవిధంగా మాట్లాడారు. న్యాయసిద్ధంగాను, రాజ్యాంగ ధర్మం రీత్యాను కాశ్మీర్ భారతదేశానిది అని శ్రీ నెహ్రూ చేసిన వాదం చెల్లదు. నైతికంగా కాశ్మీర్ పాకిస్తాన్‌ది అని ఆయన అన్నారు.

### కాశ్మీరు ప్రజల హర్షం

శ్రీనగర్, మార్చి 30: కాశ్మీర్ జాతీయ మహాసభ కార్యదర్శి బక్షి అబుల్ రషీద్ కాశ్మీరుపై శ్రీ నెహ్రూ చేసిన ప్రకటన చాలా హర్షణీయమైనదన్నారు. "ఇదినిజంగా కాశ్మీర్ ప్రజలకు ఘనవిజయం కాశ్మీరు భారతదేశంలో చేరిన ఈ ఘనవిజయానికి కొనసాగింపు" అని ఆయన అన్నారు.

## నదుల వినియోగం

### వరద నిరోధంతో పాటు వసర్లు

నదుల వాడకంపై కేంద్ర విద్యుత్తు నీటి పారుదల శాఖ వెల్లడించిన అభిప్రాయాలు: నదీలోయల అభివృద్ధి కోసం చేసే నిర్మాణాలను, ఆర్థిక సాలభ్యం దృష్ట్యా, బహుళార్థ ప్రయోజనకరాలుగా చేయాలి. హీరాకుడ్, రామగంగలపై కట్టే వసరులు, వ్యవసాయానికి నీరు ఇవ్వడం, విద్యుదుత్పత్తి చేయడానికి తోడ్పడం చేయడమే గాక, వరదనిరోధక నిర్మాణాలుగా లక్షలాది ఎకరాలను కాపాడుతాయి సోమశిల ప్రాజెక్టు అలాంటిదే.

కాబట్టి ఒక నీటివనరును తయారు చేయడంలో ఇంజనీరింగ్ దృష్టితో పాటు సంఘక్షేమం, ఆర్థికాభివృద్ధి కూడా విచారణీయాంశాలు. అన్నివిషయాలను సమీకరించి, వీలైనన్ని సౌకర్యాలూ లభించేటట్లు పథకాన్ని రూపొందించాలి.

### కొల్లేరు కుటుంబ పథకం

1. బుడమేరుకు నందిగామవద్ద రిజర్వాయర్ (రూ. 10580 వేలు). 2. మళ్లింపుకాలువ (రూ 26 లక్షలు). 3. ముత్యాలంపాడునుంచి ఏలూరు కాలువదాకా గట్లు (రూ. 10 లక్షలు). 4. ఏలూరు కాలువనుంచి ఎలుకపాడుదాకా ప్రవాహమార్గాన్ని సరిచేసి గట్లుపోయడం (రూ. 1050 వేలు). 5. ఎలుకపాడునుంచి కొల్లేరుదాకా గట్లు (రూ. 15 లక్షలు). 6. తమ్మిలేరుకు ఎర్రంపలివద్ద రిజర్వాయిర్ (రూ. 180 లక్షలు). 7. ఏలూరు కాలువనుంచి కొల్లేరుదాకా గట్లు (రూ. 1530 వేలు). 8. ఎర్రకాలువకు రిజర్వాయిర్ (రూ. 40 లక్షలు). 9. జైసేరుకు రిజర్వాయిర్ (రూ. 495౦ వేలు). పులివాగు రిజర్వాయిర్ (రూ. 260 వేలు).

### పురపాలక సంఘాలు

కర్నూలు, మార్చి 31: పురపాలక సంఘాల ఎన్నికలు జూన్‌లో జరుగుతవని మే 4 వ వారంలో అభ్యర్థులనుండి అభ్యర్థిపత్రాలు స్వీకరించబడరని, స్థానిక సంస్థలమంత్రి డా॥ ఎ. బి. నాగేశ్వరరావు వెల్లడించారు.

కొత్త పురపాలక సంఘాలు జూలై 1 న ఏర్పాటవుతవి.

## ఏప్రిల్ 11 న శంకుస్థాపన: 9 న మంత్రులు పరిశీలిస్తారని ఉపముఖ్యమంత్రి వెల్లడి

### రిజర్వాయిర్ ఎందరికి లాభకరం అని అడుగుతే పన్ను పడుతుందేమోనని రైతులు తమకు వరదనష్టమే లేదని తప్పుకున్నారట

కర్నూలు, మార్చి 31: "బుడమేరు మళ్లింపు కాల్వను లోతుగా, వెడల్పుగా త్రవ్వి ఆనకట్టను ఎత్తుచేసేట్లయితే, యీ మళ్లింపు కాల్వ పథకం ద్వారా రిజర్వాయరు నిర్మాణం వల్ల కలగబోయే ప్రయోజనాలు పొందడానికి వీలున్నది" అని ఉప ముఖ్యమంత్రి, శ్రీ నీలం సంజీవరెడ్డి యీ ఉదయం పత్రికా ప్రతినిధులతో చెప్పారు.

అవసరమైతే రిజర్వాయరును సాగువనరుల పథకంగా, ఎగువన ఏర్పాటు చేసుకొనే విషయం పరిశీలించవచ్చు అని కూడా ఆయన తెలియజేశారు.

### 11-న శంకుస్థాపన

బుడమేరు మళ్లింపు పథకానికి ఏప్రిల్ 11-వ తేదీన ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు శంకుస్థాపన చేస్తారని చెబుతూ, శ్రీ సంజీవరెడ్డి, బుడమేరు పథకం విషయమై ఇలా తెలియజేశారు.

"రిజర్వాయరు నిర్మాణ ఆవశ్యకతను నచ్చచెప్పగలిగితే, రిజర్వాయరును తప్పకుండా నిర్మించవలసిందే. నచ్చచెప్పనైనా చెప్పాలి. లేదా చెప్పింది నమ్మనైనా నమ్మాలి. యీ రెండూ కాకుండా విమర్శించితే ప్రయోజనం ఉండదు. ఏ ఇంజనీరుఅయినా మంచి విషయం చెప్పినప్పుడు పరిశీలించవలసిందే."

### 9-న మంత్రుల పరిశీలన

"అసలు ఈ విషయాన్ని అంతా సమగ్రంగా ఏప్రిల్ 9-వ తేదీన జరుగనున్న మంత్రివర్గ సమావేశంలో పరిశీలించడానికి అనుకూలంగా, ఇందుకు సంబంధించిన భోగట్టా యావత్తూ సేకరించవలసిందిగా కోరాము. ఈ విషయాన్ని నేను ఒక్కడనే నిర్ణయించలేదు. ఆర్థికశాఖకు ఆధ్వర్యం వహించిన ముఖ్యమంత్రి కూడా చూశారు. ప్రణాళిక వేసి, అంతా వివరముగా చెప్పితే వారు కూడా ఒప్పుకొన్నారు."

### ఎక్కువ సొమ్ము కోసం చేశాం

"వరద నివారణ పథకాలకుగాను కేంద్ర ప్రభుత్వం మాకో 50 లక్షలు మంజూరు చేసింది. వీలు ఉన్నంతవరకూ, ఎక్కువ సొమ్ము సంపాదించవలెననే ఉద్దేశ్యంతో మొదట్లో పరిశీలన జరిగిన పథకాలు, జరగని పథకాలను అనేకం పంపాము. నిజానికి ఏలేరు, తమ్మిలేరు, పథకాల పరిశీలన ఇంకా జరుగుతుంది."

### రైతులు తప్పుకున్నారు

"బుడమేరుమీద నిర్మించదలచిన మూడు పథకాలలో కోటికి పైగా రిజర్వాయరు పథకానికి ఖర్చు అవుతున్నది. ఈ పథకంవల్ల ఎన్ని ఎకరాలు లాభిస్తుంది; అసలు ఎంత ప్రతిఫలం ఉంటుంది అని ముందు ఆర్థికశాఖ అడిగారు.

ఆ విచారణ ప్రారంభించేసరికి, అభివృద్ధి పన్ను పడుతుందేమో అనే భయంతో మా భూమికి నష్టము లేదంటే, మా భూమికి నష్టం లేదని అంతా తప్పుకొన్నారు. మునిగిపోయే లెక్క వచ్చేసరికి లక్షల ఎకరాలు మునిగి పోతుందంటున్నారు."

"ఇంతలో పబ్లిక్ వర్క్సు మరొక అభ్యంతరం చూపించారు. మళ్లింపు పథకానికి ఏడు మైళ్ళ ఎగువన, రిజర్వాయరు నిర్మాణం అనవసరం అని, వరద నివారణకే అయినట్లయితే మళ్లింపు పథకాన్ని అందుకు అనువుగా రూపొందించుకోవచ్చు అని సలహా యిచ్చారు. రిజర్వాయరును నిర్మించితే అది వరద వచ్చినప్పుడు ఏడు ఎనిమిది గంటలలో నిండిపోతుంది అనీ, అందువలన వరద నివారణ పథకంగా అది ఎక్కువ ప్రయోజనకారి కాదు అని అన్నారు."

### మళ్లీ పరిశీలించాలి

"వరద నివారణ ముఖ్యంగా అయినట్లయితే మళ్ళింపు పథకంక్రింద ఆనకట్ట ఎత్తు పెంచటం ద్వారాను, కాలువను వెడల్పు లోతుచేయడంవల్ల, ఆ ప్రయోజనాన్ని సాధించవచ్చును అని చెప్పారు. ఇక నీటివసరు నిమిత్తమే అయితే, యిప్పటి ప్రణాళిక ప్రకారం కోటిరూపాయలు ఖర్చుపెట్టి కట్టే రిజర్వాయరుక్రింద, తగినంతి సాగు అయ్యే భూమిలేదు. ఇదే డబ్బుతో, బుడమేరుకు పైగలో రెండుమూడు చిన్న చిన్న, రిజర్వాయర్లను నిర్మిస్తే ఎక్కువభూమి సాగు అయి ప్రతిఫలంవచ్చే అవకాశం ఉందేమో పరిశీలించవలసి ఉన్నది"

### వంశధార పథకం

### ఉపముఖ్యమంత్రి ఆమోదం

కర్నూలు, మార్చి 31: వంశధారా నదికి సన్నానాయ్‌వద్ద రిజర్వాయర్ కూడా నిర్మించాలని ఒరిస్సాప్రభుత్వం చేసిన ప్రతిపాదన ఆంధ్రప్రభుత్వానికి సమ్మతమేనని ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి యీవేళ పత్రికా విలేఖరులకు చెప్పారు.

ఉపముఖ్యమంత్రి ఇట్లావివరించారు: "సన్నానాయ్‌వద్ద రిజర్వాయర్ నిర్మించడం పాతపట్టణం తాలూకాకు ప్రయోజనకరం అయితే ఈ రిజర్వాయర్ నిర్మాణ పథకానికి 'ఆమోదం లభించేవరకు ఆగకుండా గొట్టవద్ద ఆనకట్ట (డామ్) ను నిర్మించే పథకాన్ని మొదట అమలు చేయవలసి ఉన్నది. మొదట అనుకున్న పథకం ప్రకారం గొట్టవద్ద ఆనకట్టను నిర్మించితే టెక్కలి తాలూకాకు, శ్రీకాకుళంజిల్లా దక్షిణ ప్రాంతంలోని ఇతర తాలూకాలకు ప్రయోజనకరంగా ఉంటుంది."

కర్నూలులో ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీ నబకృష్ణ చౌదరి చేసిన ప్రకటన ప్రకారం గొట్టవద్ద ఆనకట్టను నిర్మించడానికి తోడుగా (సన్నానాయ్‌వద్ద) ఒక రిజర్వాయర్ కూడా నిర్మించాలన్న ప్రతిపాదన వచ్చింది.

పర్లాకిమిడి ప్రాంతంలో ముంపును తగ్గించేందుకు వీలుగా గొట్టవద్దనిర్మించే ఆనకట్ట ఎత్తు తగ్గించవచ్చునని కూడా ఉప ముఖ్యమంత్రి చెప్పారు. సన్నానాయ్‌వద్ద రిజర్వాయర్‌ను నిర్మించాలనే ప్రతిపాదనను దృష్టిలో పెట్టుకొని గొట్టవద్ద ఆనకట్టను మొదట నిర్మించడం అవసరమని శ్రీ సంజీవరెడ్డి అన్నారు.

పారిస్, మార్చి 30: స్పెయిన్ సింహాసనానికి వారసుడనని చెబుతున్న అల్ఫాన్సో రాకుమారుడు, పొరపాటున పిస్తోలు పేలి మరణించినట్లు వార్తలు వస్తున్నాయి.

## హైదరాబాదులో వైద్య సౌకర్యాల అభివృద్ధి

### మరాట్వాడాలో వైద్యకళాశాల ఏర్పాటుకు ప్రయత్నం

హైదరాబాదు, మార్చి 31: వైద్యశాఖమంత్రి శ్రీ మెహదీనవాజ్, బడ్జెట్‌లో వైద్యశాఖ పద్దుపై చర్చకు సమాధానమిస్తూ రాష్ట్రంలో ప్రస్తుతం, 16 ఆరోగ్య దళాలు పని చేస్తున్నవనీ, యీసంవత్సరంలో మరో నాలుగు యేర్పాటు చేస్తామని, యీ శాఖకు ఎక్కువ డబ్బు లభించినకొద్దీ, ఆస్పత్రులకు మందుల సరఫరా పెంచి వైద్య సౌకర్యాలు పెంపొందిస్తామని హామీ యిచ్చారు.

వైద్యకళాశాలలో, నిరుడు 80 మంది విద్యార్థులను చేర్చుకోగా యీ యేడు 110 మందిని చేర్చుకొనడమైందని ఆయన చెప్పారు.

గాంధీ వైద్యకళాశాల విషయం ప్రస్తావిస్తూ, విద్యార్థులు తమ చదువులు కొనసాగించడానికి, ఎంత బాగా తోడ్పడాలి అనే విషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నదని అన్నారు.

ఈ కళాశాలను నిరుడు జూన్‌లో ఉదారులైన కొందరు డబ్బు పోగుచేసి ప్రారంభించారు. మిగతా రాష్ట్రాలలో మాదిరే విద్యా సౌకర్యాల అభివృద్ధికి, యీ రాష్ట్రంలో గూడా దాతలు ముందుకు వచ్చి సహాయపడాలని లేకపోతే, కొత్త కళాశాలల స్థాపనకు ప్రభుత్వమే ఖర్చు యావత్తు భరించడం కష్టమవుతుందని శ్రీ మెహిదీనవాజ్ అన్నారు.

కొత్తగా వైద్యకళాశాల యేర్పాటు చేయాలంటే కనీసం 50 [illegible] కావాల్సిఉంటుందని ఆయనఅన్నారు. ఆయుర్వేద కళాశాల విషయం చెబుతూ, సిద్ధభవనం సంపాదించడానికి ప్రయత్నం చేస్తున్నాము, ఆ ప్రయత్నం ఫలించగానే, కళాశాలను అభివృద్ధి చేస్తాము అని హామీ యిచ్చారు. కళాశాలలో తెలుగుభాష ద్వారా విద్యాబోధనవిషయం, ఆంధ్ర తెలంగాణా రాష్ట్రం యేర్పడ్డతరువాత ఆలోచిస్తాము" అని చెప్పారు.

హోమియో కళాశాలను నెలకొల్పాలని ప్రభుత్వం సంకల్పించిందికాని, ప్రవీణులు వద్దని సలహాయిచ్చినందున ఆ సంకల్పం విరమించుకొనడమైందని వెల్లడించారు.

అంతక్రితం ప్రతిపక్ష నాయకుడు శ్రీ దేశపాండే మాట్లాడుతూ, వైద్యులు, ఆస్పత్రులలో, రోగులకు శస్త్ర చికిత్స చేసేముందు డబ్బు అడుగుతున్నారని, డబ్బు యివ్వకపోతే శస్త్ర చికిత్స అనవసరమని సలహాయిచ్చి పంపుతున్నారని ఫిర్యాదు చేశారు.

రాష్ట్రానికి తగినంతమంది వైద్యులను సమకూర్చడానికిగాను, స్వల్పకాలిక వైద్య తరగతులను ఏర్పాటు చేయాలని సూచించారు. నగరంలో 18 వేల కార్మిక జనానికి ప్రత్యేకంగా ఒక ఆస్పత్రి ఏర్పాటు చేయాలని కోరారు.

చర్చలో, పి. డి. ఎఫ్. సభ్యుడు శ్రీ పెంధేం వాసుదేవ, శ్రీ గంగారెడ్డి, శ్రీ గోపాలశాస్త్రి పాల్గొన్నారు. ఆయుర్వేదం, యునానీ ఎక్కువ మంది ప్రజలకు అందుబాటులో ఉన్నవి గాబట్టి, ఆ వైద్య విధానాలకు ప్రోత్సహించాలని కోరారు.

హోమియో కళాశాలను పెట్టాలని శ్రీ గురువారెడ్డి సూచించారు.

ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు చర్చ సందర్భంలో కల్పించుకొని, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో, మరాట్వాడాలో, వైద్య కళాశాల యేర్పాటు చేసే విషయం పరిశీలించడానికి ఒక సంఘాన్ని నియమించామని వెల్లడించారు. ఈ కళాశాలను ఔరంగాబాద్‌లో పెట్టాలని ఆలోచన ఉన్నది. ఆ ఆలోచనకు ప్రభుత్వం వ్యక్తి చెప్పిందని మరాట్వాడా సభ్యులు విమర్శించగా ముఖ్యమంత్రి జోక్యం కలుగజేసుకొని పై విషయం వెల్లడించారు.

## ఆఫ్రికా ముస్లిములకు అరబ్ సహాయం

### నిరసనగా ఫ్రెంచి విదేశాంగమంత్రి సిరియా, లెబనాన్ పర్యటన వాయిదా

పారిస్, మార్చి 30: ఆల్జీరియన్ జాతీయవాదులకు అరబ్ లీగ్ సహకారం యివ్వ నిశ్చయించినందువల్ల సిరియా, లెబనాన్‌లకు తన ప్రయాణాన్ని ఫ్రెంచి విదేశాంగమంత్రి శ్రీ పినే వాయిదా వేసినట్లు ఫ్రెంచి విదేశాంగశాఖ తెలిపింది. సిరియా, లెబనాన్, రాయబారులకు శ్రీ పినే తన నిరసన తెలియజేసినట్లు కూడా వెల్లడించారు.

### ఫ్రెంచివారిచే 103 మంది హత్య

ఆల్జీర్స్, మార్చి 30: గత 24 గంటలలోనూ 103 మంది ఆల్జీరియన్ జాతీయవాదులను ఫ్రెంచి సేనలు హతమార్చినట్లు తెలిసింది. పోలీసులను కూడా ఫ్రెంచి సేనలు తమ చర్యలలో నృపయోగిస్తున్నవి. నిన్న విప్లవకారులు ఒక సైనిక శిబిరంపై దాడిచేసి 9 మందిని చంపివేశారు. ఒక వైద్య ఉద్యోగి నొందుక కోసివేశారు.

ఇది యిలావుండగా అసలు ఫ్రాన్సు మీదనే దాడి జరుపుతామని "ఆఫ్రికన్ సైన్యం" పేరుతో కరపత్రాలు వెలువడ్డాయి. 120 సంవత్సరాల క్రితం ముస్లింలు ఆక్రమించుకున్న పొయిటియర్స్, సెయింట్ ఎటినీ, లయాన్స్, ఆల్ప్స్, పిరనీస్ పరిసరాలు తిరిగి వశపరచుకొనేందుకు ఆఫ్రికన్ సైన్యం, ఉత్తరాఫ్రికా పోరాటం తరువాత సంసిద్ధం కాగలదట.

### మొరాకో పరిస్థితి

మొరాకోలో శాంతి స్థాపనకు సుల్తాన్‌తో సహకరించగలమని 30 మంది విప్లవనాయకులు నేడు రాబట్‌లో హామీయిచ్చారు. నాయకులైన వీరంతా నేడు సుల్తాన్ ముందు మోకరిల్లి వాగ్దానం చేశారు. వీరంతా పర్వత ప్రాంతాలనుంచి అక్కడికి ఊరేగి వచ్చారు. దీనితో యిక మొరాకోలో శాంతి ఏర్పడుతున్నదని భావించవచ్చు.

## హైదరాబాదు ఋణ విమోచన చట్టానికి అనుమతి నిరాకరణ

న్యూఢిల్లీ, మార్చి 31: హైదరాబాద్ శాసనసభ ఆమోదించిన వ్యవసాయదారుల ఋణ విమోచనబిల్లులో కొన్ని అభ్యంతరకర అంశాలు వున్నందున రాష్ట్రపతి ఆమోదం యింతవరకు లభించలేదని నేడు లోక్‌సభలో శ్రీ బి. యన్. దాతార్ వెల్లడించారు. ఆ అంశాలను పునః పరిశీలన నిమిత్తం రాష్ట్ర శాసనసభకు తిరిగి పంపుతున్నామని చెప్పారు.

## ఆంధ్ర హైదరాబాదు మంత్రుల సమావేశం

### కొత్త రాష్ట్రం ఏర్పాటుపై కర్నూలులో ఏప్రిల్ 3 న చర్చలు

### హైకోర్టు శాఖ నెలకొల్పడం సమస్య

కర్నూలు, మార్చి 31: రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లుపై ఆంధ్ర హైదరాబాద్ రాష్ట్రాల ప్రతినిధుల మధ్య ఏప్రిల్ 3 వ తేదీన జరిగే సమాలోచనలలో పాల్గొనేందుకు హైదరాబాద్ ముఖ్యమంత్రి డాక్టరు బూర్గుల రామకృష్ణరావుతోపాటు ఇతర మంత్రులు శ్రీ కె. వి. రంగారెడ్డి, డాక్టరు ఎమ్. చెన్నారెడ్డి, శ్రీ మేల్కోటే, హైదరాబాద్ ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ జె. వి. నరసింగరావు గారలు కూడా ఇక్కడికి వస్తున్నారు.

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలను కలిపి ఏర్పాటుచేసే కొత్త రాష్ట్రానికి "ఆంధ్రప్రదేశ్" అని పేరు పెట్టే విషయమై ఈ ఉభయ ప్రాంతాల ప్రతినిధుల మధ్య ఆనాటి సమాలోచనలలో ఒక ఒప్పందం కుదరవచ్చని తెలియవస్తున్నది. ఉభయ ప్రాంతాల నాయకుల మధ్య అంగీకారం కుదిరితే కొత్త రాష్ట్రానికి "ఆంధ్ర ప్రదేశ్" అని పేరు పెడితేనే బాగుంటుందన్న అభిప్రాయానికి హైదరాబాద్ రాష్ట్రంలో కూడా ఎక్కువ బలం కనిపిస్తున్నది.

పాతే విశాలాంధ్ర హైకోర్టుసమస్య. హైకోర్టును హైదరాబాదులో ఏర్పాటుచేసి గుంటూరులో దానికి శాఖా న్యాయస్థానాన్ని ఏర్పాటు చెయ్యాలన్న ప్రతిపాదన వచ్చిందట. ఈప్రతిపాదన తెలంగాణా నుంచి వచ్చిందని చెబుతున్నారు.

హైకోర్టును. హైదరాబాద్ నగరంలోనే ఏర్పాటు చెయ్యాలని, ప్రత్యేకంగా ఒక శాఖ అక్కర అవసరమని ఆంధ్ర నాయకులు చెబుతూ వచ్చారు. హైకోర్టుకు శాఖా కార్యాలయాన్ని వేరే ఏర్పాటు చేస్తే న్యాయచట్టం దృష్ట్యా చిక్కులు వస్తవని అంటున్నారు. ఇదే అభిప్రాయాన్ని కేంద్ర ప్రభుత్వానికి కూడా తెలియ చేశారు.

ఏప్రిల్ 3 వ తేదీన ఇక్కడ జరిగే సమాలోచనలలో యీరెండుఅంశాలు-అంటే కొత్త రాష్ట్రం పేరు, హైకోర్టు ప్రధానాంశాలుగా చర్చిస్తారని తెలుస్తున్నది.

ఏప్రిలు 3 న కర్నూలులో జరిగే సమావేశంలో పాల్గొనడానికి రమ్మనమని ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజును ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి ఆహ్వానం పంపించారని ఆంధ్ర పత్రిక విజయవాడ విలేఖరి తెలుపుచున్నారు.

### శ్రీ బూర్గుల కార్యక్రమం

కర్నూలు, మార్చి 31: ఏప్రిల్ 3 వ తేదీ ఉదయం హైదరాబాద్ ముఖ్యమంత్రి డాక్టరు బూర్గుల రామకృష్ణరావు ఇక్కడికి వచ్చి ఆంధ్ర ప్రభుత్వ మంత్రులను కలుసుకొని మాట్లాడతారు.

ఆసాయంకాలం ఇక్కడినుంచి తిరుపతికి ప్రయాణమవుతారు. తిరుపతి, తిరుచానూరు చూచుకొని 6 తేదీ రాత్రికి మదరాసు వెళ్తారు. 7, 8 తేదీలు మదరాసులో మకాం. 8 తేదీ రాత్రి మదరాసునుంచి బయలుదేరి ఇక్కడికి వచ్చి తేదీ జరిగే నాగార్జున సాగరం ప్రాజెక్టు అజమాయిషీమండలి సమావేశంలో పాల్గొంటారు. అదే రోజు రాత్రి ఇక్కడినుంచి హైదరాబాదుకు బయలుదేరి వెళ్తారు.

### ఆంధ్రప్రదేశ కాంగ్రెసు సమావేశం

విజయవాడ, మార్చి 31: ఏప్రిల్ 20 తే విశాఖపట్టణంలో జరిగే సమావేశంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లును ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గం పరిశీలించుతుంది.

బడ్జెట్, 1956 ఆయవ్యయాలు, సభ్యత్వం, తదితర అంశాలను కూడా సమావేశంలో చర్చిస్తారు.

ఈవిషయాలనే పరిశీలించేందుకు ఆదేరోజు సాయంకాలం ఆంధ్ర కాంగ్రెసు సర్వసభ్య సమావేశం కూడా జరుగుతుంది.

## నిజమైన కమ్యూనిజం

### ఇక తెలుసుకుంటారు

లండన్, మార్చి 30: కమ్యూనిస్టు పార్టీ తీవ్ర తప్పిదాలు చేసిందని అంగీకరిస్తూ రష్యాలో నూతన పంథా అవలంబిస్తున్నందుకు బ్రిటిషు కమ్యూనిస్టు నాయకులు నేడు హర్షం వెల్లడించారు.

సుమారు 34 వేల మందికి సభ్యత్వం గల బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులు వేయిమంది నేడు వార్షిక సమావేశంలో పాల్గొన్నారు.

"ఆ తప్పు లేమిటో మనం తెలుసుకుని చర్చిద్దాం. అయినా ఆ తప్పులు మనం సక్రమంగా పురోగమించడానికి దోహదమిచ్చేవే. నిజమైన కమ్యూనిస్టు పార్టీ అంటే ఎలా వుండాలో యిక తెలుసుకుంటారు." అని విలియం గలాచర్ అన్నాడు. శ్రీ గలాచర్ యిదివరలో పార్లమెంటు సభ్యుడు, కాని ఆ మధ్య జరిగిన ఎన్నికలలో ఓడిపోయాడు. ప్రస్తుతం పార్లమెంటులో కమ్యూనిస్టుపార్టీకి ఒక్క స్థానంకూడా లేదు.

శ్రీ హారీపాలిట్ ప్రసంగిస్తూ కార్మిక-కమ్యూనిస్టు పక్షాలు ఏకమై ప్రస్తుత ప్రయత్నాన్ని పడగొట్టాలని సూచించారు. పాలిట్ సమర్పించిన నివేదికను నేడు, రేపు చర్చిస్తారు.

# కేంద్రప్రభుత్వం బియ్యం చోరీ

## మహబూబాబాద్‌లో 18 బస్తాలు జప్తు

మహబూబాబాద్, మార్చి 29: మహబూబియా అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ ఆవరణలో కేంద్రప్రభుత్వపు గోదాం నుండి అక్రమంగా చేరవేస్తున్న 18 బియ్యంబస్తాలను సర్కిల్ ఇన్‌స్పెక్టరు శ్రీ జహాంగీర్ అలీఖాన్ పట్టుకొన్నారు. ఇది యీ నెల 24 న జరిగింది. ఈ పట్టణంలోని, ప్రముఖ వర్తకుడు ఒకరు యీ ఫ్యాక్టరీ ఆవరణనుంచి, బియ్యం బస్తాలు లారీలో వేసుకొని వెళ్లుతుండ డంచూచి, గోదాము కాపలామనిషి పోలీసులకు తెలియజేశాడని, వెంటనే సర్కిల్ ఇన్‌స్పెక్టరువచ్చి లారీని పట్టుకొన్నారని తెలిసింది. ఆ బియ్యంతనదే నని, కొత్తబియ్యమని, ఆ వర్తకుడు వాఙ్మూలంలో తెలియజేశాడట.

నిన్న వరంగల్లునుంచి, కేంద్ర ప్రభుత్వపు గోదాములకు సంబంధించిన ఉద్యోగి ఒకరు వచ్చారు. దర్యాప్తు జరుగుతున్నది.

## తూర్పుజర్మని సైన్యం

బెర్లిన్, మార్చి 30: మొదటిసారిగా తూర్పు జర్మన్ సైన్యం నేడు ప్రత్యక్షమైంది. వందలాది సైనికులు, నౌకా వైమానిక దళాలు, కమ్యూనిస్టు మహాసభలో పాల్గొన్నారు. సమావేశానికి ఉపప్రధాని హెర్ వాల్టర్ ఉల్‌బ్రిట్ అధ్యక్షత వహించాడు.







తెనాలి ప్రిన్సిపల్ సబుకోర్టులో
Sc 13/56

వాది: మూర్తి అంకిరెడ్డి & Co

ప్రతివాది: మంతెన బాపిరాజుగారి కుమారుడు వెంకటరాజు (M. L. A.) సా॥ మంతెనవారిపాలెం.

ప్రోనోటుపై రు. 992/- లకుచేయబడిన దావాలో ప్రతివాదికి నోటీసు వాయిదా 16-4-56. ఆరోజున ప్రతివాది హాజరుకానిచో ఆయన పరోక్షమందు తీర్మానించబడును.

అ. రామసుబ్బారావు,
వాదితరపు అడ్వొకేటు.

కొండవరం డిస్ట్రిక్టు మునసబు కోర్టులో
O. P. 7/56

పిటిషనర్లు-బుడ్డిగఅప్పలకొండవగైరాలు.
రెస్పాండెంటు-బుడ్డిగ సత్యనారయ్య.

బుడ్డిగ అప్పలకొండ ఆమె బిడ్డ అమైనరు కుమార్తె లక్ష్మణరావు అప్పారావుగార్ల తర్ఫున ఓరియంటల్ లైఫ్ అష్యూరెన్సు కంపెనీలో తన భర్త అతని జీవితం మీద యిన్‌సూర్ చేసిన 1111875 నెంబరు పాలిసీమీద అతను చనిపోయినసర్కి రావలసిన సొమ్ము రు.719/ వసూలు పొందుటకు సక్సెషను సర్టిఫికటు యిప్పించమని ఈ కోర్టులో దాఖలు చేసిన పిటీషను 6-4-56 వ వాయిదా. ఆక్షేపణ చెప్పవలచిన వారం దరూ ఆరోజు ఉ. 11 గం॥ యీ కోర్టులో హాజరయి తెలుపవలెను. లేనియెడల ప్రకారం లీన్ను చేయబడును.

కొండవరం | యనమండ్ర సుబ్రహ్మణ్యం.
32-3-56 | పిటిషనర్ల తరఫు ప్లీడరు.

## ప్రకటన

వంద్యాల (కర్నూలు జిల్లా)లో ఆంధ్రపత్రిక (దినపత్రిక, సచిత్ర వార పత్రిక, భారతి మాసపత్రిక)లను వారి స్వంత బాధ్యతపై విక్రయించుకొనుటకు శ్రీ కె. సుబ్బాలాల్ పాండేగారి స్థానే శ్రీ. మహానంది రెడ్డిగారిని 1-4-1956 నుంచి నియమించడమైనది.

మేనేజరు,
ఆంధ్రపత్రిక, మద్రాసు-1.

# రాష్ట్ర వార్తలు

## తెనాలి

శ్రద్ధానంద హరిజన కాలనీ శిక్షణ పాఠశాలలో విద్యార్థినుల "ప్రోగ్రెస్ డే" శ్రీ డి. జగన్నాథరెడ్డి అధ్యక్షతన జరిగింది. శ్రీమతి సుశీలాదేవి శిక్షణ పత్రాలు పంచిపెట్టారు. శ్రీ కొల్లా కాశీవిశ్వనాథం దంపతుల కృషిని అధ్యక్షులు ప్రశంసించారు. బాలికలు నృత్యం, నాటకలు ప్రదర్శించారు. శ్రీమతి కొల్లా తాయారమ్మ వందన మర్పించారు.

## పామర్రు

మార్చి 26 న వయోజన విద్యా ప్రచారోత్సవం జరిగింది. ఊరేగింపు తరువాత సభకు శ్రీ టి. ప్రసాదరావు అధ్యక్షత వహించారు. శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు, టి. తిరుమలరావు, గడియారం అచ్యుతరామశాస్త్రి టి. వీరాంజనేయులు, టి.వి. ప్రసన్నారావు, లంకా నరసింహం గారలు ప్రసంగించారు.

## వేటపాలెం

శిక్షణ పాఠశాల విద్యార్థులకు వీడ్కోలివ్వడానికి శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుపంతులు అధ్యక్షతన సభ జరిగింది. శ్రీయుతులు నాని శ మల్లికార్జునరావు (ప్రధానోపాధ్యాయులు) మునిమాణిక్యంనరసింహారావు, కె.సూర్యనారాయణమూర్తి, ఎ. శేషగిరిరావు, యం. సీతారామయ్య, కె. వి. సుబ్బారాయశర్మ, పింజల నాగేశ్వరరావు, జె. స్వామినాథాచార్యులు, సముద్రాల వెంకటేశ్వరరావు సభలో ప్రసంగించారు.

## విజయనగరం

విజయనగరం, భీమిని తాలూకాల ప్రాథమికోపాధ్యాయులు శ్రీ చెన్నుపాటి లక్ష్మయ్య అధ్యక్షతన సమావేశమై జిల్లాలోని ప్రాథమిక పాఠశాలలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని కోరుతూ తీర్మానించారు. ఉపాధ్యాయులలో ఐక్యతవసరమని అధ్యక్షులు ప్రసంగిస్తూ చెప్పారు.

## పిఠాపురం

యువజనసంఘ అధ్వర్యాన 2వ వార్డులో వయోజన పాఠశాల ఉచిత పఠన మందిరానికి భవనాల నిర్మాణానికి కొన్న స్థలంలో మార్చి 21న శ్రీ జోరు సూర్యనారాయణ శంకుస్థాపన చేశారు. శ్రీ ఏడిద చక్రధరరావు అధ్యక్షత వహించారు. శ్రీ యం. భావనాచారి మాట్లాడారు.

## పండితవిల్లూరు

శ్రీ పొట్టి శ్రీరాములు బాలానంద సంఘ అధ్వర్యాన బాలానందం వేడుకలు జరిగినవి. శ్రీ ఇందుకూరి సత్యనారాయణరాజు అధ్యక్షత వహించారు. శ్రీ డి. ఆర్. కె. రాజు ప్రసంగించారు. శ్రీ స్వామి పెద్దల సహకారం అర్థించారు. పిదప చిత్రకళా, సాహిత్య ప్రదర్శనలు జరిగాయి. నాటకములు ప్రదర్శించారు.

## యలమర్రు

గ్రామ కమ్యూనిస్టుపార్టీ అధ్వర్యమున బహిరంగసభ జరిగింది. శ్రీ సుంకర చంద్రమౌళీశ్వరరావు అధ్యక్షత వహించారు. శ్రీ తిరిమెల నాగిరెడ్డి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను గురించి వివరించారు. కృష్ణాజిల్లా దళం ముద్రమదేవి బుర్రకథ, రాజకీయ గయోపాఖ్యానము ప్రదర్శించారు.

## అత్తిలిలో పశువైద్యశాల

అత్తిలి, మార్చి 29: అత్తిలిలో పశువైద్యశాలకు పశ్చిమగోదావరిజిల్లా పశువైద్యశాఖాధికారి డాక్టరు అబ్దుల్ ఖాదర్ సాహెబ్ ప్రారంభోత్సవం చేశారు. అసందర్భంలో జరిగిన బహిరంగసభకు శ్రీ అన్నెం శేషారావు అధ్యక్షతవహించారు. ఈవైద్యశాలకని తమ తండ్రి అన్నెం రత్తయ్య పేరిట కుమారుడు 10 వేల భవనాలను కట్టించుచున్నందుకు శ్రీ శేషారావును పలువురు అభినందించారు. రెండవ పంచవర్ష ప్రణాళికలో పశుసంపదాభివృద్ధి ఏర్పాట్లను డాక్టరు దశరథ రామయ్య వివరించారు. అత్తిలి పంచాయతీ అధ్యక్షుడు శ్రీ వి. బాపన్న వందనసమర్పణ చేశారు.

## ఆంధ్రరాష్ట్ర పంచాయతీల సంఘం

రాజమండ్రి, మార్చి 30: ఆంధ్ర రాష్ట్ర పంచాయతీ అధ్యక్షుల సంఘ కార్యవర్గ సమావేశం ఏప్రిలు 21, 22 తేదీలలో ఇక్కడ జరుగుతుంది. స్థానిక పరిపాలనాశాఖ సలహా ప్రకారం రెండవ పంచవర్ష ప్రణాళికవిషయమై విరివిగా ప్రచారం చేసేందుకు ప్రతిజిల్లాలో నెలనెలా పంచాయతీల మహాసభలను యేర్పాటుచేసే విషయం, తదితర అంశాలను సమావేశంలో చర్చిస్తారని సంఘ ప్రధానకార్యదర్శి శ్రీ వి. ముత్యాలరావు ప్రకటిస్తున్నారు.

## నూర్లహారుపేట ఆసుపత్రి

కర్నూలు, మార్చి 30: నూనెపల్లెరుపేట ఆసుపత్రిని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని అవసరమైన సౌకర్యాలన్నింటిని సమకూర్చి అభివృద్ధి చేయించమని కోరుతూ ముఖ్యమంత్రికి శాసన సభా సభ్యుడు శ్రీ ఎ. గోపాల కృష్ణారెడ్డి ఒక విజ్ఞప్తి సమర్పించారు.

రెండువందల గ్రామాల్లోని సుమారు రెండులక్షల జనాభాకు నూనెపల్లెరుపేటలోనిదే ఆసుపత్రి. మలేరియా, బోదకాలువంటి వ్యాధులు ఆ ప్రాంతంలో ఎక్కువ. కనుక నూనెపల్లె పేట ఆసుపత్రిని అభివృద్ధి చేయుమని ప్రభుత్వాన్ని విజ్ఞప్తిలో అర్థించారు.

# తూర్పు గోదావరిలో నీటి తీరువ

## తగ్గించాలని విజ్ఞప్తి

కర్నూలు, మార్చి 30: భద్రాచలం తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కోటగిరి కొండలరావు, తూర్పు గోదావరి జిల్లా కిసాన్ సమ్మేళనం కార్యదర్శి శ్రీ పెండ్యాల సత్యంగారలు రెవిన్యూ మంత్రిని కలుసుకొని తమ ప్రాంతాలలో అదనపు నీటి తీరువను తగ్గించమని కోరారు.

వారు సమర్పించిన విజ్ఞప్తిలో ఇట్లా ఉన్నది:

"రంప చోడవరం వంటి మన్య ప్రాంత తాలూకాలలోను, పూర్వము జమీందార్ల అధీనంలోఉన్న కొన్ని ప్రదేశాలలోను వర్షాకాలంలో వరితప్ప ఇతర పంటలు వేసే అవకాశం లేదు. నీటి వనరులకు ప్రభుత్వం కాని, తదితరులు కాని మరమ్మతులేమీ చేయించలేదు. అటువంటి ప్రాంతాలలో అదనపు నీటితీరువ వసూలు చేయడం ధర్మంకాదు. ఆ ప్రాంతాలలోనివే అయిన ఈనాం భూములకు మాత్రం అదనపు నీటితీరువ వసూలుచేయడం లేదు. ఈ విషయం దర్యాప్తు చేయించాలి."

నిత్యావసరాలకు కావలసిన అకుల వంటి వాటిని అడవులనుంచి రైతులు తదితరులు తెచ్చుకోవడానికి అనుమతించమని వ్యవసాయ శాఖ మంత్రి శ్రీ కందుల ఓబులరెడ్డిని శ్రీ కొండలరావు, సత్యం గారలు అభ్యర్థించారు. పొగాకు పదునుచేసేందుకు అవసరమైన పుల్లలను మన్య ప్రాంత వర్జీనియా పొగాకు ఉత్పత్తిదారులకు ప్రభుత్వం నిర్ణయించిన ధరను అడవులనుంచి సప్లయి చేయించవలసిన అవసరం వివరించారు. కలప విక్రయ శాలలను ఏర్పాటు చేయించమని కూడా అభ్యర్థించారు.

# వేదవేదాంగ పరీక్షలు

## భట్నవిల్లిలో

అమలాపురం, మార్చి 30: తూర్పు గోదావరి మండల వేదప్రవర్ధకసభ నియమానుసారం యీ తాలూకా భట్నవిల్లి గ్రామంలో ఏప్రిల్ 7, 8 తేదీలలో వార్షిక సభ నాడు వేదవేదాంగ పరీక్షలు జరుపుతారు. సభ నిబంధనల ప్రకారం, పరీక్షయిచ్చే ప్రతి విద్యార్థికి 100 బహుమతి యిస్తారు. వార్షికోత్సవసభకు వచ్చేవారికి ఉచితంగా భోజనాది సదుపాయాలు ఏర్పాటుచేస్తారు. సుప్రసిద్ధ పండితులు ఉపన్యాసాలిస్తారు.

## ద్రోణాచలంలో నీరా సహకార సంఘం

కర్నూలు, మార్చి 30: కర్నూలు జిల్లా ద్రోణాచలంలో నీరా ఉత్పత్తి సహకారసంఘం నిన్న ఏర్పాటైంది. ఆ సందర్భంలో జరిగినసభకు శ్రీ ఎస్. శేషన్న అధ్యక్షత వహించారు. సంఘానికి శాసనసభ సభ్యుడు శ్రీ అనగాని భగవంతరావు ప్రారంభోత్సవం చేశారు.

## పల్నాడు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి

మాచర్ల, మార్చి 26: ఆయుర్వేద వైద్యాభివృద్ధికి లక్ష్మణస్వామి సంఘం చేసిన సిఫార్సులను వెంటనే అమలు జరిపించి, రాష్ట్ర ఆయుర్వేద మండలిని ఏర్పాటు చేయమని ప్రభుత్వాన్ని కోరుతూ పల్నాడు తాలూకా ఆయుర్వేద వైద్య మండలి ప్రారంభోత్సవంలో తీర్మానించారు.

సభకు డాక్టరు సింగం శివయ్య అధ్యక్షత వహించారు. శ్రీ ఎస్. ఎ. సుభాన్ సాహెబ్ పతాకోత్సవం చేశారు. రాష్ట్ర మండలి ప్రధాన కార్యదర్శి కవిరాజ మోహన్ సభను ప్రారంభించారు.

శ్రీయుతులు ఎస్. సీతారామశాస్త్రి, పులివర్తి సుబ్రహ్మణ్యం, నారాయణం కృష్ణమూర్తి, పి. అప్పంరాజు, వెంకటరామమూర్తి, పి. ఓబళాచార్యులు, మూర్తి, కె. బసవలింగయ్య మొదలైన వారు ప్రసంగించారు.

పల్నాడు తాలూకా ఆయుర్వేద వైద్యమండలికి ఈ క్రింది కార్యవర్గం ఎన్నికైనారు. అధ్యక్షుడు-శ్రీ సింగం శివయ్య, ఉపాధ్యక్షుడు-శ్రీ ఎస్. సీతారామశాస్త్రి, ప్రధానకార్యదర్శి-శ్రీ పి. ఓబళాచార్యులు, సహాయ కార్యదర్శి-శ్రీ కె. బసవలింగయ్య, కోశాధికారి-శ్రీ కె. శివలింగయ్య, కార్యవర్గ సభ్యులు-శ్రీయుతులు యస్. కృష్ణమూర్తి, పల్లి హనుమచ్ఛాస్త్రి ఉల్లి జ్ఞానప్రకాశరావు, పి. సుబ్రహ్మణ్యం, కె. సత్తెయ్య, పి. అప్పంరాజు, కె. వీరయ్య మొదలైనవారు.

శ్రీ వెన్నెల్లి నరసింహాశర్మ అధ్యక్షతన వైద్య విజ్ఞానసభ జరిగింది. శ్రీయుతులు పల్లి హనుమచ్ఛాస్త్రి, ఎస్. రామచంద్రరాజు, ఎస్. సీతారామశాస్త్రి, పి. ఓబళాచార్యులు గారలు ప్రసంగించారు. శ్రీ అప్పాజీ వశం ఆయుర్వేద చరిత్ర బుర్రకథ కాలక్షేపం జరిపారు.

## భారతీయ వర్తకుని అక్రమ వ్యాపారం

రంగూన్, మార్చి 30: రెండువజ్రాలను టిన సామానులో దాచి భారతదేశం చేరవేయడానికి ప్రయత్నించారన్న నేరానికి ఒక భారతీయ వ్యాపారస్తుని నిన్న విమానాశ్రయంవద్ద అరెస్టు చేశారు. వాటి విలువ రు 1½ లక్షలుండవచ్చునని సంబంధిత అధికారులు తెలిపారు. చిన్న డబ్బాలో వీటిని దాచారని చెప్పారు.

# భావి భారత పౌరుల శిక్షణ - పరీక్షలు

## నిస్సహాయులైన ఉపాధ్యాయులు సహాయానికి పోలీసులు

సరిగ్గా పరీక్షా పత్రాల్లో వచ్చే ప్రశ్నలనే చెప్పగల ఉపాధ్యాయుడు కొందరు విద్యార్థుల పాలిటి దేవుడు!! ఉపాధ్యాయుడే కాదు-ప్రెస్‌లో పనిచేసే కంపోజిటర్ వంటి ఉద్యోగులు తదితరు లెవరైనా సరే పరీక్షా పత్రాల తతంగాన్ని చెప్పగలిగితే ఈ విద్యార్థులు వారికి బ్రహ్మరథం పడతారు. ఈ క్రమను మూడా బహుముఖం. విద్యార్థుల తెలివితేటలను నిష్కర్షగావిలువ కట్టేవి. పరీక్షా పత్రాలు కావు, పరీక్షలు!!

ప్రశ్నలకు వారువ్రాసే జవాబులలో కాక, ఆ జవాబులను పరీక్షలు జరిగే కేంద్రాల్లో హాజరు పెట్టడానికి వారుచేసే కృషిలో విద్యార్థుల బహుముఖ ప్రజ్ఞ విశదమవుతుంది!

### చచ్చు దద్దమ్మతనం

ఇక ఉపాధ్యాయులలో తాము ఎంత కష్టపడి చెప్పినా "ఈ చచ్చు దద్దమ్మల బుర్రల కెక్కితేనా చస్తేనా" అని విద్యార్థులను వారి ఖర్మానవారిని వదిలి తమపొట్ట నింపుకోడానికి నాలుగు రాళ్లు ఎట్లా సంపాదించాలా అని దిగులుపడుతూ - ఆ దిగులు పోగొట్టుకోడానికి రకరకాల కృషిచేసేవారున్నారు.

చచ్చుదద్దమ్మలనుపైకి పంపుతున్నారని విద్యాశాఖ డైరెక్టరూ ఒప్పుకుంటున్నారు (రాజమండ్రి సభలో). అనేకులు ఉపాధ్యాయులు తమ ఊరి నాయకులు ఒత్తిళ్లు భరించలేక చచ్చు దద్దమ్మలను పైకిపంపి బతికి బయటపడక తప్పటంలేదని ఒప్పుకుంటున్నారు. విద్యార్థులు కాపీలుచేసి, తాము చచ్చు దద్దమ్మలమే అని ఋజువు చేసుకుంటున్నారు.

### ఉపాధ్యాయులకు యక్షప్రశ్న పద

జరుగుబాటు సంగతి ఎట్లా వున్నా సంవత్సరమంతా శ్రమించి విద్యార్థులకు చదువు చెప్పాలిగదా? ఇక పరీక్షా పత్రాలు ఎట్లా ఉంటవి? పరీక్షలలో రావడానికి అవకాశం ఉన్న ప్రశ్నలన్నింటిని ఊహించి పిల్లలకు చెప్పాలా లేదా? మన ఊహకు అందని ప్రశ్నలు పాఠ్యాంశాలలో ఏమైనా ఉన్నవా? అనేది ఉపాధ్యాయులు ఎదుర్కొనవలసిన సమస్యలలో ఒకటి.

పరీక్షాకేంద్రాలలో పర్యవేక్షణాధికారులుగా నియమితులయ్యే ఉపాధ్యాయులది పెద్ద సమస్య. నీతి బుద్ధిగల విద్యార్థులు పరీక్షలలో నెగ్గడానికి వేసే ఎత్తులు ఫలించకుండా ఉండడానికి — విద్యార్థుల ఎత్తులను నిరోధించడానికి ఉపాధ్యాయులను పర్యవేక్షణాధికారులుగా నియమిస్తున్నారు. నిజంగా ఇది చాలా చిక్కు పని అని మనదేశంలో వినాడో ఋజువైంది.

### చూస్తేనూ తప్పు - చూడకున్నా తప్పు

కాపీ కొట్టవద్దని భావి భారతి పౌరులను ఉపాధ్యాయులు మందలిస్తే ఇక ఆ ఉపాధ్యాయులు క్షేమంగా ఇళ్లకు తిరిగి వెళ్ళడమనేది చాలా సందేహాస్పదమైన విషయం.

పోనీ మనకెందుకొచ్చిన తెవద, చూచీ చూడకుండా పోదాం—మన సొమ్ము ఏం పోయిందనుకుంటే- ఇటువంటి ఉపాధ్యాయులు పర్యవేక్షణాధికారులుగా పనికి రారని విద్యాశాఖ నిర్ణయించి అసమర్థులని విమర్శిస్తారు.

దాగుడుమూత లాటలైన ఈ పబ్లిక్ పరీక్షలకు కాలదోషం పట్టిందని విద్యావేత్తలంటారేగాని వాటికి బదులు నీసలైన పరీక్షా పద్ధతిని ఇంతవరకు అమలులోకి తీసుకురాలేదు. అందుకు ప్రయత్నంకూడా జరగడంలేదు.

### అవకాశాలున్నాయికానీ.

విద్యార్థుల శక్తిసామర్థ్యాలను, తెలివితేటలను విమర్శించి ప్రయోజనంలేదు. ఈ నాటి విద్యార్థికి పది సంవత్సరాల నాటి విద్యార్థికంటే అనేకవిషయాలు తెలుసుకోవడానికి అనేక అవకాశాలున్నవి.

పరీక్షలో కొన్ని విచిత్రాలు తటస్థమౌతాయి. పరీక్షా పత్రాలలో పొరపాట్లు. లేకపోతే ఈ క్రింది లెక్క అర్థమేమిటి?

### చక్రవడ్డీ తంతు

"సంవత్సరానికి 5% చక్రవడ్డీ లెక్కన 2 సం॥ లలో రు 4000 లు ఎంతకు మొత్తమగును?"

ఇది ఈ మార్చి స్కూల్ ఫైనల్ పరీక్షలలో సామాన్య గణితం మొదటి భాగంలో ఇచ్చిన 3-వ ప్రశ్న.

రు 4000 లు ఎంతకు మొత్తమగును అని లెక్కలో ఉండడంవల్ల రు 4000 ను మొత్తంగా తీసుకుని చాలా మంది విద్యార్థులు అసలు కనుక్కున్నారని శ్రీ ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు, మునగపాకనుంచి శ్రీ వాడపల్లి పర్వేశ్వర రావు వ్రాస్తున్నారు. ఈలెక్కలో వడ్డీరేటు ఇచ్చారు. కాలం ఇచ్చారు. ఇక కనుక్కోవలసిందేమిటి? నాలుగు వేలు అనే మొత్తమెంతకిచ్చారు. కొట్టెక్ కనుక్కోవలసింది అసలు అని విద్యార్థులు అభిప్రాయపడితే తప్పేమిటి? ఇదే లెక్క అంగ్లమున ఇట్లా ఉన్నది: "Find the amount at 5% compound interest on Rs. 4000/-"

ఇంగ్లీషులోని లెక్క సరయినదైనచో, అనువాదంగా ఇచ్చిన లెక్కకు విద్యార్థులిచ్చిన సమాధానం తప్పు అవుతుంది.

### అనువాద వైపరీత్యం

లెక్క ఎట్లా చెయ్యాలో తెలియక విద్యార్థులు చేసినతప్పుకాదిది. అసలు వడ్డీరేటు, కాలం, మొత్తాలకు సంబంధించిన సూత్రం ఇది

$$A = P + \left(1 + \frac{r}{100}\right)^n$$

ఈ సూత్రం ప్రకారం విద్యార్థులు లెక్క చేయగలరు. చేయడంలో తప్పు వచ్చే అవకాశం లేదనడంలేదు. కాని ఇంగ్లీషులో ఉన్న లెక్కను తెలుగులోకి అనువదించడంలో "ఎంతకు మొత్తమగును?" అని అనువదించితే కనుక్కోవలసినది 'అసలు'అనివిద్యార్థులు భావించడంలో పొరపాటు కనిపించదు. పరీక్షా పత్రంలో ఇటువంటి పొరపాటు ఎందుకు జరిగిందో తెలియదు. ప్రాంతీయ వ్యావహారిక పదజాలంవల్ల వచ్చే పొరపాటని చెప్పదలిస్తే అర్థాన్ని స్పష్టంగా విద్యార్థులకు వివరించమని ఆయా కేంద్రాలలోని ఉపాధ్యాయులను ఆదేశించి ఉండవలసింది.

### సిద్ధాంతం ఉపసిద్ధాంతం

మరొక ఫిర్యాదు: కంపోజిట్ లెక్కల పత్రం 4 వ ప్రశ్న (ఎ) భాగంలో "సిద్ధాంతానికి" బదులు "ఉపసిద్ధాంతాన్ని" ఇచ్చి ఋజువు చేయమన్నారని ఇందుకూరు పేటనుంచి శ్రీ కె. శ్రీనివాసరావు వ్రాస్తున్నారు. ప్రశ్న పత్రం మామూలు పద్ధతిని మార్చారని 9 వ ప్రశ్నలోవలె ఊర్ధ్వ నిమ్నకోణములమీద ఇచ్చిన ప్రశ్నకు నిర్మాణక్రమం వ్రాయమన్నారని ఇదివరకెప్పుడూ ఇటువంటి ప్రశ్నలను ఇవ్వలేదని శ్రీ శ్రీనివాసరావు వివరించారు.

ఈ "ఉపసిద్ధాంతం" విద్యార్థులు కంఠస్థం చేయవలసిన సిద్ధాంతాలలో లేదని XI గ్రాస్ లెక్కల ప్రణాళికలో లేదని ఆరుమూరు విద్యార్థులు ఫిర్యాదులు చేస్తున్నారు.

ఉపసిద్ధాంతం అంటే ఇంగ్లీషులో "కొరాలరీ" ఋజువయిన "సిద్ధాంతం" నుంచి కొరాలరీ వస్తుంది, కొరాలరీ ఇచ్చి ఋజువు నిర్వమంటే అర్థం అందుకు సంబంధించిన సిద్ధాంతాన్ని ఋజువు చెయ్యాలన్న మాట.

### తణుకునుంచి ఆశాభంగం

మొదటి భాగం తెలుగు పేపరులో దండాన్వయం వ్రాయమని యిచ్చిన పద్యాలు విద్యార్థులకు ఆశాభంగం కలిగిస్తున్నవని తణుకునుంచి పండిత పి. సత్యనారాయణ రాజుగారు వ్రాస్తున్నారు. కంఠస్థం చేయవలసిన పద్యాలనే ప్రతిసంవత్సరం మొదటి విభాగం తెలుగు పరీక్షాపత్రంలో దండాన్వయం వ్రాయడానికి ఇస్తున్నారని, కంఠస్థం చేయనవసరంలేని పద్యానికి దండాన్వయం వ్రాయమనడం సమంజసంగా లేదని విమర్శించుచున్నారు.

కాంపోజిట్ లెక్కల పాఠ్యప్రణాళిక పునఃపరిశీలించి సవరించవలసిన అవసరం వివరించుచూ చల్లపల్లి నుంచి శ్రీ వి. వి. కృష్ణమూర్తి ఒక జాబు వ్రాశారు. ప్రయోగ రేఖాగణితానికి 22 మార్కులుంటవిగదా అని ఆశపెట్టుకొని ఆ అంశానికే అధిక ప్రాముఖ్య మిచ్చిన విద్యార్థులకు ఈ సంవత్సరం పరీక్షా పత్రం ఆశాభంగం కలిగించిందని శ్రీ కృష్ణమూర్తి విమర్శించారు.

### క్రిందటి ఏటివి ఇచ్చారు!

పౌర సాంఘికశాస్త్రం పరీక్షా పత్రంలో గతసంవత్సరం జరిగిన పాఠాలలో 18 ప్రశ్నలు ఈ సంవత్సరం జరిగిన పాఠాలలో ఒక్క ఒక ప్రశ్న ఇచ్చారని విమర్శించుచూ పెద్దాపురం నుంచి శ్రీ వి. సూర్యనారాయణ ఒక జాబు వ్రాస్తున్నారు. విద్యార్థులకు తెలిసిన విషయాలను కాక తెలియని విషయాలను కనిపెట్టడమే ఈ పరీక్ష ఉద్దేశంగా కనిపిస్తున్నదని శ్రీ సూర్యనారాయణ విమర్శించారు.

ఇదే విధంగా యీ పరీక్షా పత్రాన్ని విమర్శించుచూ ప్రొద్దుటూరు నుంచి శ్రీ అమరవాది సుబ్రహ్మణ్యం మరొక జాబు వ్రాశారు.

రెండవ విభాగం ఇంగ్లీషు పేపరులోని లోపాలను విమర్శించుచూ విజయనగరం నుంచి శ్రీ ఎల్. నరసింహారావు వేరొక జాబు వ్రాశారు.

### తీరికలేని వారికి శ్రమ

తెలిసిన విషయాలను కాక విద్యార్థులకు ఈ యీ విషయాలు తెలియవని ఋజువు చెయ్యడానికే అన్నట్లు కూడా పరీక్షాపత్రాలు తయారవుతున్నాయి. అసలే వారికి ఈ చదువులపై శ్రమించేందుకు వ్యవధి ప్రభారత్రంలో లేక లేదామె. దైనా చిక్కు ప్రశ్నలడిగితే ఏం చెయ్యాలి? పవర్షభారు వివరాలుబ్రోవి జవాబు ప్రశులను రహస్యంగా జేబులోనో కాకపోతే బోర్డ్లోనో దాచిపెట్టుకుని తీసుకురావడానికి వీలైన "చిన్న "పుస్తకాలు గా" తయారుచేసి, పరీక్షా కేంద్రాలకు తీసుకు రావడం అనేక కేంద్రాలలో జరిగింది. గూడపల్లి అనే ఊళ్ళో పర్యవేక్షణాధికారులు "అపాధనాలను" పట్టుకుని విద్యార్థుల పన్నుగడలను గంపపాలుచేశారు. కాపీకొట్టడానికి తెచ్చుకున్న-అంత కష్టపడి తయారు చేసుకున్న ఆ సరంజామా తీరా తప్పులతడక. అదైనా దాగలేదాయె!

ఇటువంటి స్కూల్ ఫైనల్ పబ్లిక్ పరీక్షలలో విద్యార్థులు బాగా కృతార్థులు కావాలని వాపోవడం కంటే మార్గాంతరం లేదా?

చదువులు నిర్వహించేవారు, చెప్పేవారు, చెప్పించుకునే వారు "భావి భారత పౌరశిక్షణ" ఇట్లా పోలీసు సహాయంతో, నిస్సహాయులైన ఉపాధ్యాయులతో, రాజకీయ నాయకులు దాడీలు చేస్తున్న విద్యార్థులతో ఎన్నాళ్లు నడుపుతారు?

# సిగరెట్ల ఫ్యాక్టరీ నెలకొల్పవచ్చు

## భద్రాచలం ప్రాంత పొగాకు కార్మిక తీర్మానం

భద్రాచలం, మార్చి 26: వర్జీనియా పొగాకుబాగా దొరికే ప్రాంతమైన భద్రాచలంలో సిగరెట్ల ఫ్యాక్టరీ ఒకటి ఏర్పాటుచేయించమని ప్రభుత్వాన్ని కోరుతూ భద్రాచలం మన్యప్రాంత ఐ. యల్. టి. డి. పొగాకు కంపెనీల పనివారి సమైక్య సంఘ ప్రథమ వార్షికోత్సవంలో నిన్న తీర్మానించారు.

సభకు శ్రీ జె. యస్. బాలాజీదాస్ అధ్యక్షత వహించారు.

సంఘ కార్యదర్శి శ్రీ బండారుచంద్రారావు వార్షిక నివేదిక చదివారు. విశాలాంధ్ర ఏర్పడనున్నది కనుక భద్రాచలంనుంచి రాజమండ్రికి రోడ్ భద్రాచల-కొత్తగూడెం రైలుమార్గం వేస్తారని, ఈ ప్రాంతంలో పరిశ్రమలు వాణిజ్యం ఇకబాగా ఎక్కువవుతవని శ్రీ బాలాజీదాసు అన్నారు.

ఈ సంవత్సరం చేసినట్లు ఋతువులో 40 రోజులు కాక కనీసం 4 నెలలైనా పనివారికి పనిచూపించమని కంపెనీ అధికారులను అభ్యర్థించారు.

ఈప్రాంతంలో ధాన్యం ధరలు విపరీతంగా పెరిగినవి. కనుక శ్రామికుల సౌకర్యార్థం చవక దుకాణాలను ఏర్పాటు చేయించమని ప్రభుత్వాన్ని కోరారు. గుమాస్తాలకు మన్య ప్రాంతాలలో ప్రత్యేక వేతనాలను ఏర్పాటుచేసి శ్రామికులకు నివాసగృహాలను కట్టించమని ఒకతీర్మానంలో కోరారు.

కొత్త సంవత్సరానికి ఈదిగువ కార్యవర్గం ఎన్నికైనారు. అధ్యక్షుడు-శ్రీ మహమ్మద్ తహసీల్: ఉపాధ్యక్షుడు-శ్రీ జట్టిబాపీడు కార్యదర్శి-శ్రీ బండారు చంద్రారావు, సహాయ కార్యదర్శి-శ్రీ రావులపల్లి వీరయ్య, కోశాధికారి-యం. వెంకటరావు, కార్యవర్గ సభ్యులు- శ్రీయుతులు యస్. ప్రేమయ్య, పి. అర్జయ్య, వై. గోపయ్య, బి. సాయన్న, బి. వసంతరావు, శ్రీయుతులు జి. వరలక్ష్మి, డి. సూర్యకాంతమ్మ, ఎ. మహాలక్ష్మమ్మ, కె. ఆదెమ్మ, పి. లక్ష్మీదేవి, బి. చారమ్మ గారలు.

## చిట్టవరం ప్రజలు శ్రమదానంతో చెరువు మరమ్మతు

నర్సాపురం, మార్చి 30: చిట్టవరం గ్రామం రజకులు మంచినీటికోసం ఉపయోగించుకొనే చెరువు ప్రజల శ్రమదానంతో మరమ్మతు చేశారు. పంచాయతీ అధ్యక్షుడు, సభ్యులుకూడా ఈ శ్రమదానంలో పాల్గొన్నారు.

డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు శ్రీ పి. రామమోహనరావు, పట్టణకాం గ్రెసు అధ్యక్షుడు శ్రీ కె. సత్యనారాయణ, ఆగ్రామం వెళ్లి, ప్రజలు, పంచాయతీ సభ్యులు చేసిన శ్రమదానాన్ని శ్లాఘిస్తూ సభలో ప్రసంగించారు.

## కడపలో సయామీ కవలలు

కడప, మార్చి 29: పారిజాన్‌బీ క్రితం సోమవారంరాత్రి ఆస్పత్రిలో, శరీరాలు అంటుకొనిపోయి వికతప్రాణులైన కవల శిశువులను ప్రసవించింది. ఈ శిశువులకు మిగతా అవయవాలన్నీ వేరుగా ఉన్నవి కాని, పొట్టమాత్రం ఒకటే. ఇలాంటి శిశువులు, సయాం దేశంలో జన్మించడం పరిపాటి. ఈ విధంగా శరీరాలు అంటుకొని జన్మించే కవలలను సయాం కవలలు అని పిలుస్తారు.

ఈ కవలలకు. నూనెరాచి చెవపో కుండా భద్రపరచారు, రోజూ వందల కొలది మంది వచ్చి చూచి వెడుతున్నారు.

## నాలిక కోసుకున్నా దేవి అప్రసన్నమే!

బెనారెస్, మార్చి 30: ఒక కళాశాల విద్యార్థి గతరాత్రి అన్నపూర్ణాదేవి గుడికివచ్చి చాలాసేపు స్తుతించాడు. ఎంతసేపటికీ అన్నపూర్ణాదేవి అనుగ్రహించకపోవటంతో ఆఖరికి ఆమెను శాంతింపజేయటానికి బ్లేడుతో తన నాలుకనుకోసి అమ్మవారికి సమర్పించాడు.

ఇతనిని ఆస్పత్రిలో చేర్పాల్సి వచ్చింది, వచ్చింది. క్రమంగా కోలుకుంటున్నాడు.

# ఆకాశవాణి

సోమవారం, ఏప్రిల్ 2

### విజయవాడ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగున వార్తలు 7-15 మద్రాసు వలె 7-30 జి. ఎస్. రాజకోకిలం 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 1 (బి) వలె 1-30 (ఎ) వలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 2 (బి) వలె 2-10 హిందీలో వార్తలు.

సా॥ 5-30 మొక్కపాటి నాగేశ్వరరావు వీణ 5-45 సంగీతశిక్షణ 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా॥ 6-15 గ్రామ॥ కార్యక్రమం చేనేత పరిశ్రమ (ప్రసంగం) వేణువు కె. కర్ణక్ భక్త విజయములోని కథలు (తుకారాం కథ) 7 తెలుగున వా॥ 7-15 గోష్ఠిగానము: అప్పపదులు 7-30 గానసుధ (8) 7-45 ప్రజాకవితా మాధుర్యము, జానపద గేయములలోని కవితా చమత్కృతి (ప్రసంగం వి. వి. వీరేశలింగం 8 సౌందరనందము-సంగీత రూపకం రచన పింగళి లక్ష్మీకాంతం, కొటూరి వెంకటేశ్వరరావు 9 ఆం. వా॥ 9-15 రెండవ ప్రణాళికలో గృహావసతులు మురికి పేటల నిర్మూలన (ఆంగ్లమున ప్రసంగం) టి. వి. ఎస్. చలపతిరావు 9-30 అభివృద్ధి ప్రణాళిక (ఆంగ్లమున ప్రసంగం) 9-45 మొక్కపాటి నాగేశ్వరరావు-వీణ 10 ప్రసారసమాప్తి.

### మద్రాసు (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమం॥ 7 వాద్య సమ్మేళనం 7-15 తమిళ వా. 7-30 జి. ఎస్. రాజకోకిలం.

మ॥ 12-30 సంధికోణం కమల 1-30 (బి) 1-40 హిందీ వా. 1-50 (బి) 2 తమిళ వా. 2-10 పక్షీవ్ కే విశేషతాయే ధ్వోస్వర: దసరా (హిందీ ప్రసంగం) కటీల్ గణపతి శర్మ 2-25 తమిళ ప్రసంగం 2-40 విరామసంగీతం 2-50 పి. ఎస్. కృష్ణమూర్తి.

సా॥ 5 పాశ్చాత్య సంగీతం (బి) 5-30 ఎడ్వర్డ్ పాల్-సితార్ 6-5 ప్రాంతీయ వా. 6-15 జి. పిచ్చమ్మాళ్. 6-45 బి. అచ్యుతరామన్ 7-15 తమిళ వా. 7-30 తిరుచిసవలె 8-30 ఢిల్లీవలె 8-45 విరామ సంగీతం 9 జంత్రసమ్మేళనం 9-15 హిందీ పాఠం 9 45 (బి) వలె 11 ప్రసార సమాప్తి.

### మద్రాస్ (బి)

ఉ॥ 7-0 తెలుగు వా. 7-15 తిరువెంగాడు సుబ్రహ్మణ్య పిళ్లై, నాదస్వరం (బి) 7-30 ఎ. వలె 8 ఆంగ్ల వా. 12 కార్మికుల కార్యక్రమం 12-30 ఎ. వలె 1-30 ఆంగ్ల వా. 1-40 (బి) 1-50 తెలుగు వా. 2-0 క్లోజ్ 2-10 ఎ. వలె

సా॥ 5-0 ఎ. వలె 5-50 స్థానిక ప్రకటనలు 6 ఆంగ్ల వా. 6-15 గ్రామ కార్యక్రమం 7-0 తెలుగు వా. 7-15 గోష్ఠిగానము అప్పపదులు 7-30 జంత్ర సమ్మేళనం7-45 మలయాళీ ప్రసంగం 8-0 సౌందరనందము (నాటిక) 9.0 ఆంగ్ల వా. 9-15 తిరుచి వలె 11-0 ప్రసార సమాప్తి.

### హైదరాబాద్

ఉ॥ 6-50 సుప్రభాత్ 6-55 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా. 7-15 శారదా శ్యామఅయ్యంగార్ వీణ 7-45 కన్నడ వా. 8 ఆంగ్ల వా. 8-15 హిందీ వా. 8-30,ఖయాల్.

మ॥ 12-30 (బి) 12-50 మరాఠీ వా. 1 (బి) 1-10 కృతిమంజరి (బి) 1-50 తెలుగు వా.

సా॥ 5-30 ఎస్. భానుమతి గీతావళి 5-45 ఎం. ఎల్. వసంతకుమారి (బి) 6 శారదాశ్యామఅయ్యంగార్ వీణ 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ. విపణివీథి (సమీక్ష) అప్పపదులు: ఎస్. భానుమతి 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ, తెలంగాణాలోని ప్రఖ్యాత దేవాలయములు: వేయి స్తంభాలదేవాలయము (ప్రసంగం) అప్పపదులు: ఎస్. భానుమతి 7-45 గీత్, ఘజల్ 8 ప్రాంతీయ భాషాసాహిత్యం ప్రాచీన మరాఠీ సాహిత్యం (హిందీప్రసంగం) 8-15 శ్రోతల ఉత్తరాలకు జవాబులు 8-20 భజన్ 8-30 ఢిల్లీవలె 8 45 గీత్ ఘజల్ 9 ఆంగ్ల వా. 9-15 ఉర్దూ వా. 9-30 నయాచేపాల్ ఐక్యరాజ్యసమితి కార్యకలాపములను చిత్రించురూపకం 9-45 సి. హెచ్. భీమశంకర రావు 10-30 ప్రసారసమాప్తి.

కలకత్తా, మార్చి 30: రష్యా ప్రథమ ఉపప్రధానమంత్రి శ్రీ మికోయాన్ కలకత్తానుంచి రంగూన్‌కు బయలుదేరి వెళ్ళారు.

# మద్రాసు వార్తలు

కర్నూలు, మార్చి 30: గవర్నరు శ్రీ సి. యం. త్రివేది ఏప్రిల్ 14 వ తేదీని కర్నూలునుంచి విశాఖకు వెడతారు.

## కీ॥ శే॥ శ్రీ కందాల సూర్యనారాయణ

మదరాసు, మార్చి 31: మదరాసు ప్రభుత్వంలో తెలుగు అనువాదకుడుగా పనిచేసి, విరమించిన శ్రీ కందాల సూర్యనారాయణ గత మంగళవారం త్యాగరాయనగరంలో చనిపోయారు. వీరు ప్రకృతి చికిత్సకులు. 60 ఏళ్ల వయస్సు.

## తిరుపతి కాటన్ మిల్సు

ఇటీవల జారీచేసిన 15 లక్షలకు కోరిన వాటాకన్నా హెచ్చుగా దరఖాస్తులు వచ్చినవని తెలుపుటకు తిరుపతి కాటన్ మిల్సు లిమిటెడ్, మదరాసు, డైరెక్టరులు సంతసిస్తున్నారు. వాటాల కేటాయింపుకు త్వరలో డైరెక్టరులు సమావేశం కానున్నారు.

## సమితి సర్వసభ్య సమావేశం నవంబరు 12 న

న్యూయార్కు, మార్చి 29: ఈ సంవత్సరం సమితి సర్వసభ్య సమావేశం సెప్టెంబరు 18 న గాక నవంబరు 12 న జరుగుతుంది. సమితి కార్యదర్శి ఈ విషయాన్ని అన్ని సభ్యరాజ్యాలకు తెలియచేశారు.

అమెరికాలో సెప్టెంబరు-నవంబర్లలో అధ్యక్షుని ఎన్నిక జరుగుతుంది. అందుకోసం ప్రచారాలు అక్టోబరులో పెద్ద ఎత్తున ప్రారంభమౌతాయి. ఇందుకు అడ్డం లేకుండా ఈ మార్పు జరుగుతున్నట్లు తెలుస్తున్నది.

## భారతదేశంలో అల్జీరియా జాతీయవాదులు

న్యూఢిల్లీ, మార్చి 30: అల్జీరియాలో ఫ్రెంచి వలస పాలకులకు విరుద్ధంగా జరుగుతున్న స్వాతంత్ర్య సమరం, ఫ్రెంచివారిపన్నాగాలకుసంబంధించిన వివరాలను భారత ప్రభుత్వానికి,భారత ప్రజలకూ తెలియచెయ్యడంకోసం అల్జీరియానుంచి జాతీయ స్వాతంత్ర్యసంఘ ప్రతినిధులు కొందరు ఇవాళ ఢిల్లీ వచ్చారు.

అల్జీరియా స్వాతంత్ర్యోద్యమాన్ని నైతికంగా బలపరిచినందుకు భారత ప్రభుత్వానికి ఈ ప్రతినిధులు కృతజ్ఞత ప్రకటించారు.

## విశాఖరేవులో నౌకకు ప్రమాదం

విశాఖపట్నం, మార్చి 30: నిన్న రేవులో ప్రవేశిస్తుండగా, "జలరత్న" అనే సరకునౌకహార్బరుకాల్వలో మునక పట్టింది. నౌక అడుగుభాగానికి కొంత నష్టం కలిగింది. సరకు అంతా దింపివేస్తేగాని, మరమ్మతు సాధ్యంగాదని తెలుస్తున్నది.

## మదరాసు ధరలు

మదరాసు, మార్చి 31:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-8 ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 67-0-0.

| | |
|---|---|
| మెట్టుబంగారం తులం | రు. 107-4-0 |
| మూస బంగారు | రు. 105-8-0 |
| సీమవెండి తులం100కి రెడి | రు. 184-8-0 |
| చిల్లర ధర | రు. 2-14-0 |

### వేరుశనగ

(581 పౌ॥ 1-కి ఎప్పుకోస్తా గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా డిసెంబరు రు. 153-160

వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ విలో 8% 500పౌ.) రెడిచిల్లరసర 317-318

వెంకాయనూనె (87½ పౌనులు సేల్సుటాక్సు అదనం

| | |
|---|---|
| అంబుమార్కు | రు. 26-0-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 26-8-9 |
| రాజా | రు. 26-0-9 |

### ఆముదం

తిరుపత్తూరు (500 పౌ.) రు. 270-0-0 (2 మాండి)

బ్రిటిష్, రిఫైన్డ్ షుగర్ రు. 87-0-9-87-8-9

కొజాం (228) 87-8-0

# తూర్పుగోదావరిజిల్లా కొబ్బరి మార్కెటు

రాజమండ్రి, మార్చి 31:—

(ఈ నెల 24 వ తేదీతో పూర్తి అయిన వారంలో వ్యాపార ధర వివరాలు)

| కేంద్రం | వచ్చినసరకు | విక్రయమైన సరుకు | వెయ్యి 1 కి ధర రూ. లలో గంటేర | గటాగటి | చిటకాయ | నీటిబొండాం |
|---|---|---|---|---|---|---|
| అమలాపురం | 290000 | 275281 | 175/- | 160/- | 145/- | 110/- |
| అంబాజీపేట | 47000 | 47000 | 175/- | 163/- | 146/- | 108/- |
| తాటిపాక | 2,20,000 | 1,99000 | — | — | — | 110/- |
| కోటిపల్లిపాలెం | 150000 | 122000 | — | — | — | 110/- |
| రాజమండ్రి | 275000 | 246000 | — | — | — | 130/- |
| కాకినాడ | 228636 | 228636 | — | — | — | 110/- |

అంబాజీపేటలో ఎండుకొబ్బరి 500 కాయల పుట్టి 1 కి రు 252/లు ధరవున్నది. రాజమండ్రిలో 9000 కా॥ ఎండుకొబ్బరి అమ్మకం జరిగింది. (స్వ. వి.)

# బందరుకు ఓడల రాకలు పోకలు

బందరు, మార్చి 31:

| ఓడ పేరు | రాక | పోక | గమ్యస్థానం | సరుకు |
|---|---|---|---|---|
| కంకార్డియా | 11-3-56 | 29.3-56 | చినా | మునిగెనుము 8500 టన్నులు |
| ఇజాక్ పాక్ జాన్ | 28-3-56 | 10-4-56 | [illegible] | 9000 టన్నులు |



రాజస్థాన్‌లో సుందర చారిత్రిక దృశ్యాలు అనేకం. అనేక భవనాలు, కోటలు చిత్ర విచిత్ర గాథలతో పెనవేసుకొని ఉన్నాయి. యాత్రికులు విడిచివేయగల చోటు ఎక్కడో గాని లభించదు. జైపూర్ దగ్గర అంబేర్ కోటలో ఏనుగులపై యాత్రికులు.



రాజస్థాన్‌లో శ్రమదానం—ప్రజలు రోడ్లను వేశారు, బావులు, చెరువులు తవ్వారు, పాఠశాలలు కట్టుతున్నారు. అభివృద్ధి కార్యక్రమాల క్రింద జరగని ప్రజాహితకార్యం అంటూ లేదని నిరూపిస్తున్నారు.

## ఐదేళ్ల అభ్యుదయం

# నేటి రాజస్థాన్

మార్చి 30; ఇది రాజస్థాన్ వార్షికోత్సవం జరుపుకుంటున్న రోజు. 19 చిన్నచిన్న స్వదేశీ సంస్థానాలను చేర్చి కీర్తిశేషుడు సర్దార్ పటేల్ "రాజస్థాన్" అనే విశాల రాష్ట్రాన్ని ఏర్పాటుచేసింది 1949 మార్చి 30 నే. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో రాజస్థాన్‌కు కేటాయించింది 62 కోట్ల 35 లక్షల రూపాయలు. ఈ ధనాన్ని సద్వినియోగపరచడంద్వారా రాజస్థాన్ ప్రభుత్వం సాధించిన సర్వతోముఖ అభివృద్ధిని ఈ వ్యాసం సమీక్షిస్తున్నది. గత పన్నెండుమాసాలలో అపూర్వమైన కృషి జరిగింది. రెండవ ప్రణాళికలో ఈ రాష్ట్రానికి 158 కోట్లు కేటాయించారు. రానున్న ఐదేళ్లలో రాజస్థాన్ భవిష్యత్తు ఉజ్జ్వలంగా రూపొందుతుందనే ఆశించవచ్చు.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలప్రమాణం సమాప్తమవుతున్నది. లక్షా పాతిక వేల మైళ్ళవిస్తీర్ణంగల రాజస్థాన్‌లో ఎక్కడ చూడబోయినా ఈ ఐదేళ్ళ వ్యవధిలో ప్రభుత్వం, ప్రజలు పరస్పర సహకార భావంతో సాధించిన అభ్యుదయ కృషి చిహ్నాలే ద్యోతకమవుతవి.

ప్రజల జీవనంలో స్వభావం, దృక్పథం మారిపోయినట్లు వ్యక్తమవుతుంది. మధ్యయుగం నాటి పాత ధోరణికి ప్రజలు స్వస్తిచెప్పినట్లు స్పష్టపడుతుంది. కీర్తిశేషుడు సర్దార్ పటేల్ 1949 మార్చి 30వ తేదీన ఏకరాష్ట్రంగా చేయకపూర్వం, ఇప్పటి రాజస్థాన్‌లోనే చిన్నచిన్నవి 19 స్వదేశీసంస్థానాలు వుండేవి. ఇవన్నీ ఒకదానిలో ఒకటి లీనమై విశాలరాష్ట్రంగా ఏర్పడిన తర్వాత రాజస్థాన్ ప్రజలలో స్వీయ అభివృద్ధిని సాధించాలనే పట్టుదిలా, ఉత్సాహమూ ఎక్కువైనవి. ఇసుక ప్రదేశమైన "మరుస్థల" అనే పశ్చిమదిక్కు గ్రామం మొదలు వ్యాపారవాణిజ్యాలు విరివిగాసాగే జయపూర్ వరకూ ఈ సత్సంకల్పమే స్పష్టంగా కనుపిస్తున్నది.

ఇందుకు 1955 మే నెలలో పక్షం రోజుల పాటు సాగిన శ్రమదాన దీక్షపత్తాహోత్సవాన్నే ఒక బలీయమైన నిదర్శనంగా చెప్పవచ్చు.

ఈ ఉత్సవం రాష్ట్ర వ్యాప్తంగా సాగింది. మొత్తం 37 తహసీళ్ళలో 49 లక్షల రూపాయల విలువకు మించిన కృషి స్వయం సహాయం ద్వారా ప్రజలు సాధించగలిగారంటే, వారిలోని కార్యోత్సాహాలు ఏ విధంగా వున్నదీ అవగాహన చేసుకోవచ్చు. ప్రజలు ముందంజవేసి బావులు త్రవ్వుకున్నారు. రస్తాలు వేశారు. రిటా కాలు నిర్మించారు. పాఠశాలలకు భవనాలు ఏర్పాటుచేశారు. ఇంకా ఎన్నెన్నో ఇతర కార్యక్రమాలను నిర్వర్తించగలిగారు. ఈ కార్యక్రమాన్ని చూస్తే, తాము సాగిస్తున్న ప్రతిపని, స్వీయాభివృద్ధికి సంబంధించినదేనని ఈ విషయాన్ని ప్రజలు స్పష్టంగా అర్థం చేసుకున్నారనే విషయం ఎవరికైనా బోధపడుతుంది.

### పంచాయతీలు

ప్రజాస్వామిక విధానంలో గ్రామ పంచాయతీలు వాస్తవంగా కీలక సంస్థలు. రాజస్థాన్ పంచాయతీల చట్టం క్రింద ప్రభుత్వం శీఘ్రగతిని అనేక గ్రామ పంచాయతీలను స్థాపించగలిగింది. వీటికి ఈ మధ్యే ఎన్నికలు జరిగినవి. 32 వేల గ్రామాలలో ఒకసారిగా పంచాయతీలు ఏర్పాటుచేయడమంటే సామాన్యమైన విషయం కాదు. మొత్తంమీద రాష్ట్రంలో వాలిగింట మూడువంతుల భూభాగాన్ని పంచాయతీ పాలనక్రిందికి ప్రభుత్వం తీసుకురాగలిగింది.

బాగా ఆదాయంవచ్చే మార్గాలను చూపించడమే గాక ప్రభుత్వం యీ పంచాయతీలకు విస్తృతమయిన సివిల్, క్రిమినల్ అధికారాలను సైతం ఇచ్చింది. ప్రజలలో ఏర్పడిన వివాదాలు, తగాదాలు ఏర్పడినప్పుడు, ధర్మాధర్మ వివక్షణచేసి విశేష వ్యయప్రయాసలు గాని, అనవసర కాలవిలంబనం గాని లేకుండా ధర్మం చేకూరేట్లు చేయడమే ఈ పంచాయతీలకు విస్తృత అధికారాలను ఇవ్వడంలో ఉద్దేశం.

ఇంతేగాక, ఈ గ్రామ పంచాయతీలు స్థానికాభివృద్ధి కార్యకలాపాలలోనూ, ప్రజా సంక్షేమ కార్యకలాపాలలోనూ పాల్గొని సహాయపడుతున్నవి. జిల్లాబోర్డులకు పురపాలక సంఘాలకు కూడా ప్రభుత్వ ప్రోత్సాహం బాగా లభ్యమైంది. రాష్ట్రం మొత్తంమీద ఇప్పుడు 141 పురపాలక సంఘాలు, 10 జిల్లాబోర్డులు యేర్పడి పనిచేస్తున్నవి.

అనేక ఇతర రాష్ట్రాల మాదిరిగా రాజస్థాన్ కూడా వ్యవసాయమే ప్రధాన వృత్తిగాగల రాష్ట్రం. ఇలాంటి రాష్ట్రములలో భూసంస్కరణలకు సహజసిద్ధమైన ప్రాధాన్యం వుండి తీరుతుంది. రాజస్థాన్ జమీందారీల స్వాధీన శాసనం క్రింద దాదాపు 2 కోట్ల రూపాయల భూమిశిస్తు వచ్చే 4855 జాగీర్లను గత సంవత్సరాంతం లోపుగా వశపరుచుకోవడం జరిగింది. మిగతా జాగీర్లను కూడా స్వాధీనపరుచుకోవడంతో రాజస్థాన్ ప్రజలకు యీ జాగీర్దారీ దళారుల పీడ పూర్తిగా విరగడైపోతుంది. అప్పుడు రైతులు అన్ని వ్యవహారాలను పూర్తిగా ప్రభుత్వంతోనే ప్రత్యక్షంగా జరుపుకుంటారు.

ఒక్క జాగీర్దారీల రద్దు విషయంలోనేగాక, ఇతర భూసంస్కరణల విషయంలో కూడా ప్రభుత్వం శ్రద్ధ వహించే వున్నది. ఒక రైతుకుటుంబానికి వుండవలసిన భూవసతి పరిమాణం విషయంలో కేంద్ర ఉపసంఘం చేసిన సిఫార్సుల అమలును గురించి రాజస్థాన్ ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఇటీవల ఆమోదించిన అన్ని శాసనాలలోకీ రాజస్థాన్ భూమిశిస్తు నిర్ణయపు బిల్లు చాలా ప్రధానమైనది. త్వరలోనే యిది శాసనమవుతుంది. తద్వారా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలోనూ ఒకే ఒక రకమైన భూమిశిస్తు విధానం అమలు జరుగుతుంది.

### ధాన్యం పంటలు

రాజస్థాన్‌లో సాధారణంగా సాలీనా లక్షటన్నుల ఆహారధాన్యాల లోటు కనబడుతుండేది. కాలమాన పరిస్థితులు ఏమంత బాగా లేకపోతే ఈ లోటు రెండులక్షల టన్నుల వరకూ పెరుగుతుండేది. అయితే అధికోత్పత్తి కార్యక్రమాలు అనేకం అమలు జరిగి ఫలితానికి వచ్చిన కారణంచేత, లోటు పరిస్థితి తొలగిపోయింది. ప్రజావసరాలకు సరిపోగా ఇప్పుడు ధాన్యం మిగులుతున్నది. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించిన లక్ష్యానుమించే ఆహార ధాన్యోత్పత్తి, ప్రత్తి పంటా లభ్యమవుతున్నవి. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆహార ధాన్యాలు, పప్పుధాన్యాలు కలిపి మొత్తం 6 లక్షల టన్నులు అదనంగా పండించాలనే ఉన్నత లక్ష్యంతో ప్రభుత్వం కృషిచేస్తున్నది. లర వేల టన్నుల చెరకు, లక్ష బేళ్ళ ప్రత్తి, అదనంగా కొత్త ప్రణాళికలో సాధించాలని కూడా లక్ష్యంగా పెట్టుకున్నారు.

### పశుగణం

వ్యావసాయిక ఆర్థిక వ్యవస్థలో పశుసంపదకు విశేష ప్రాధాన్యం వుండక తప్పదు. అందుచేత పశుగణాభివృద్ధి విషయంలో కూడా రాజస్థాన్ ప్రభుత్వం తగిన శ్రద్ధవహిస్తున్నది. ప్రస్తుతం 259 కి పైగా పశువైద్యశాలలు రాష్ట్రం మొత్తంమీద పనిచేస్తున్నవి. ఇవిగాక, మూడు ప్రత్యేక వాహనాలలో సంచార పశువైద్యశాలల సదుపాయాలను ఏర్పాటుచేశారు. ఇలాంటి వాటినే త్వరలో మరో ఆరింటిని ఏర్పాటు చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

### అడవి పెంపకం

జైసాల్మేర్ - భవల్పూరు సరిహద్దున 40 మైళ్ళ పొడవునా, ఐదుమైళ్ళ వెడల్పునా పచ్చిక బైళ్ళను, వృక్షసంపదను పెంచుతున్నారు. పాకిస్తాన్‌లోని సింధురాష్ట్రంనుంచి ఇసుక దుమారాలు భారతభూభాగంమీద పడకుండానూ, స్థానికంగా వున్న ఎడారి భూభాగం విస్తరించకుండానూ ఇది సహాయపడుతుంది. ఈ చెట్టు చేమలను చివరకు మొత్తం 400 మైళ్ళ పొడవు వరకూ విస్తరింపజేయాలని ప్రభుత్వ సంకల్పం.

### నీటివనరులు

రాజస్థాన్ అసలే ఎడారిప్రాంతం. అందుచేత నీటిపారుదల సౌకర్యాల అభివృద్ధి ఎంత అవసరమో చెప్పనవసరం లేదు. కొన్ని పెద్ద పెద్ద పథకాలను అమలు జరుపుతున్నారు. వీటిలో ముఖ్యమైనది జవాయ్ నదిమీద నిర్మిస్తున్న ప్రాజెక్టు. ఇది దాదాపు పూర్తి కావచ్చింది. 1956 ఆఖరుకల్లా 60 వేల ఎకరాల భూమి కొత్తగా సాగులోకి వస్తుంది. జవాయ్ ప్రాజెక్టుక్రింద గత సంవత్సరం నుంచీ 14 వేల ఎకరాల భూమి నీటిసౌకర్యం లభ్యమై సాగవుతున్నది. పార్వతి, గూథ, కౌశిక్ మొదలైన పెద్ద ప్రాజెక్టుల నిర్మాణం కూడా సాగుతున్నది. ఇవిగాక చిన్నచిన్న ప్రాజెక్టులు చాలావున్నవి; ఇవి ఈ ఏడాదిలోనే పూర్తికాబోతున్నవి. చాంబల్ జలవిద్యుత్ కేంద్ర నిర్మాణం 1960 నాటికి పూర్తిఅవుతుంది. దీనివల్ల 69 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది; రాజస్థాన్‌లో చాలాభాగానికి దీనిద్వారా విద్యుచ్ఛక్తి ఇవ్వగలుగుతారు. భాక్రా ప్రాజెక్టు నిర్మాణం కూడా త్వరిత గతినే సాగుతున్నది. గంగానగర్ జిల్లాలో ఈ సంవత్సరం ఈ ప్రాజెక్టుక్రింద వర్షాకాలంలో లభ్యమైన నీటిసహాయంతో లక్షన్నర ఎకరాల భూమిని సేద్యం చేయగలిగారు. భాక్రా ప్రాజెక్టు నిర్మాణం మరొక ఏడాదిన్నరలో పూర్తిఅవుతుంది. అప్పుడు దీనివల్ల రాజస్థాన్‌లో మొత్తం 5 లక్షల 70 వేల ఎకరాల భూమికి నీరు ఇవ్వడానికి సాధ్యపడుతుంది.

ఇవి గాక చెరువుల క్రింద, బావుల క్రింద కూడా సేద్యం అభివృద్ధి చేయడానికి శ్రద్ధవహిస్తున్నారు. కొత్తగా బావులు, చెరువులు త్రవ్వించి 50 వేల ఎకరాల భూమికి నీటివనరులు ఏర్పాటు చేశారు. 1961 నాటికి బావులవల్లా చెరువులవల్లా మరొక లక్ష ఎకరాల భూమిలో మాగాణి పంటలు పండిస్తారు.

రాజస్థాన్ గ్రామసీమలలో మంచినీరు లభ్యమయేట్లు చేయడం చిరకాలం నుంచీ అతి కఠినమైన సమస్యగానే వుండిపోయింది. గ్రీష్మఋతువు వచ్చింది అనగానే ఇది బహు విషమ సమస్యగా పరిణమిస్తుంది. గ్రామసీమలలో మంచినీటి ఏర్పాట్లపట్ల శ్రద్ధ వహించడానికి "రూరల్ వాటర్ బోర్డు" అని ఒకదాన్ని నియమించారు. రాష్ట్రప్రభుత్వంలోని గ్రామ పంచాయతీల శాఖాధికారులు, ఈ బోర్డు సభ్యులు కలసి పనిచేసి, గ్రామీణులకు మంచినీరు సప్లయిచేసే విషయంలో చాలా వరకు కృతకృత్యులు కాగలిగారు. గ్రామాలలో మంచినీటిసప్లయి పథకాల అమలుకు ప్రథమ పంచవర్ష ప్రణాళికలో రాజస్థాన్ ప్రభుత్వానికి ఒకకోటి రూపాయలు కేటాయించారు.

కొన్ని కొన్ని పట్టణాలలో మంచినీటి సప్లయి సౌకర్యాలను అభివృద్ధి చేయడమేగాక, అనేక కొత్త పట్టణాలలో కాలువలను సైతం ఏర్పాటు చేశారు.

### జాతీయవిస్తరణ కృషి

జాతీయ సంక్షేమ విస్తరణ పథకాల పట్ల ప్రజలు మంచి ఉత్సాహాన్ని ప్రదర్శించి, ప్రభుత్వంతో సహకరిస్తున్నారు.

జాతీయ-సంక్షేమ కేంద్రాలు మొత్తం 16 కొత్తగా ఇటీవల ఏర్పడడంతో వీటిసంఖ్య 31 కి పెరిగింది. 16 సమాజ వికాసాభివృద్ధి కేంద్రాలు వున్నవి. వీటిలో బహుళ ప్రయోజనాలను సాధించడానికి నిరంతరం కృషి జరుగుతున్నది. ఇప్పుడు ఈ పథకాలు రాష్ట్రంలో నాల్గోవంతుకు మాత్రమే వర్తిస్తున్నవి. ద్వితీయ ప్రణాళిక క్రింద రాష్ట్రం అంతటా ఇవి అమలు జరుగుతవి.

### విద్యావ్యాప్తి

విద్యావ్యాప్తి, వైద్యసహాయం, రాకపోక సౌకర్యాల అభివృద్ధి విషయంలో కూడా రాజస్థాన్ గమనార్హమైన అభివృద్ధినే సాధించగలిగింది. 5884 ప్రాథమిక పాఠశాలలు, 84 మాధ్యమిక పాఠశాలలు, 44 ఉన్నత పాఠశాలలు, 6 ఇంటర్మీడియేట్ కళాశాలలు, డిగ్రీలు ఇచ్చే కళాశాల ఒకటి, ఒక ఇంజనీరింగు కళాశాల ప్రథమ ప్రణాళిక కాలంలో స్థాపించారు. విద్యావిధానంలో ప్రాతిపదిక విద్యకు, సాంకేతిక శిక్షణకు- ప్రస్తుతం ప్రాధాన్యం ఇస్తున్నారు.

వెనుకబడిన తెగల అభివృద్ధినికూడా రాజస్థాన్ ప్రభుత్వం విస్మరించలేదు. అస్పృశ్యతా నివారణ శాసనం అమలులో అనేక ప్రతిబంధకాలు తొలగిపోయినవి. హరిజన విద్యార్థులకు భోజనవసతి సౌకర్యాలు లభ్యమైనవి. వారు ఉచితంగా విద్య నభ్యసిస్తున్నారు. విద్యార్థి వేతనాలను పొందుతున్నారు.

### పరిశ్రమలు

పారిశ్రామికాభివృద్ధి మాత్రం తగినంతగా చేకూరలేదు. అనేక కొత్తపరిశ్రమల స్థాపనకు ప్రభుత్వం బృహత్పథకాలను తయారుచేసింది. విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు పూర్తిఅయి, రాకపోక సౌకర్యాలు అభివృద్ధి కావడంతో పరిశ్రమల శీఘ్రాభివృద్ధికి చక్కని అవకాశాలు ఏర్పడుతవి. గృహపరిశ్రమల వ్యాప్తికి మొత్తం మూడు శిక్షణాలయాలు పనిచేస్తున్నవి. వీటిలో ప్రధానమైనది జోధ్‌పూరులో వున్నది.

రాజస్థాన్‌లో అనేక ఖనిజాలు పుష్కలంగా లభ్యమవుతవి. కేంద్ర ప్రభుత్వ సహాయంతో రాష్ట్ర ప్రభుత్వం వీటి సద్వినియోగానికి యథోచిత కృషిచేస్తున్నది. రెండేళ్ల క్రితం ఖనిజపరిశోధనశాల నొకదాన్ని ప్రభుత్వం స్వయంగా ఏర్పాటు చేసింది. జిప్సం విస్తారంగా దొరుకుతుందికాబట్టి, అమ్మోనియం సల్ఫేట్ ఫ్యాక్టరీ స్థాపించడానికి సమగ్రపథకం తయారైంది. దీన్ని కేంద్రప్రభుత్వ పరిశీలనకు పంపించారు.

ప్రథమ పంచవర్ష ప్రణాళికక్రింద కేటాయించిన మొత్తం 62 కోట్ల 35 లక్షల రూపాయలలో రాజస్థాన్ ప్రభుత్వం మొదటి రెండుమూడేళ్ళలో ఎక్కువభాగాన్ని వినియోగించుకోలేకపోయింది. గత పన్నెండు నెలలలో మాత్రం పని అతిచురుకుగా సాగించింది. ఈ ఒక్క ఏడాదిలోనే దాదాపు 17 కోట్ల ధనాన్ని ఖర్చుచేసి అమూల్యమైన ఫలితాలను సాధించగలిగింది.

ద్వితీయప్రణాళికక్రింద రు. 158 కోట్లు ఈ రాష్ట్రానికి కేటాయించారు. ప్రథమప్రణాళికా చరిత్ర అనుభవంతో రాజస్థాన్ ద్వితీయప్రణాళిక క్రింద అద్భుతమైన అభ్యుదయాన్నే సాధించగలదనడంలో ఆశ్చర్యమేమీలేదు.



సమాజాభివృద్ధి కార్యక్రమాల ధర్మమా అని అనేకులు వయోజనులు కూడా చదువుకుంటున్నారు. రాజాస్ మండీ గ్రామంలో ఒక పాఠశాల.



సమాజాభివృద్ధి కార్యక్రమాలు గ్రామీణులలో చాలా ఉత్సాహం కలిగించాయి. ఛత్రపూర్ ప్రాంత గిరిజనులు (కోటాజిల్లా), ఈ కార్యక్రమంక్రింద నెలకొల్పిన చికిత్సాలయాన్ని బాగా వినియోగించుకుంటున్నారు.



రాజస్థాన్‌కు మిడుతల దండుల బెడద వస్తూ ఉంటాయి. ఉన్న కొలది పంటలను తినేస్తాయి. అక్కడనుంచి ఈ తిరకసరంలో మరి ఇతర ప్రాంతాలపై దాడిచేస్తూ ఉంటాయి. మిడతల దండులను ఎదుర్కోవడానికి, వాటిపై క్రిమి సంహార ఔషధాన్ని చల్లడానికి ఒక ఉద్యోగవర్గం సరంజామాతో తయారుగా జోధ్‌పూర్‌లో ఉంటుంది.

## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ ఫాల్గున బ॥ షష్ఠి 1956- సం॥ ఏప్రిల్ 1 ఆదివారం అ॥ షష్ఠి 21.47 జ్యేష్ఠ 20-25 వర్జ్యం రా 5-24 ల

బ॥ సప్తమి ఏప్రిల్ 2 సోమవారం సో॥ సప్తమి 24-15 మూల 28-24 వర్జ్యం తె 7-13 కు వర్జ్యం 21-50 ల 23-24 కు.

# ఆంధ్రపత్రిక

ఉది తేయది మొంపరిందిన
వరవర దుప్రియము శక మకంబున శగు రా
వాదులకు కవి సేయకుని
వలాయుజము వరముద్రన్యసదముంరెల్లన్
(మహాభారతము)

శ్రీ మన్మథ సం॥ ఫాల్గున బ॥ షష్ఠి

ఆదివారం

## కోటి రూపాయలకు కొత్త పన్నులు

విద్యార్థుల నుంచి జీతాలు వసూలు చేయక మూడవఫారం వరకు ఉచిత విద్యాసౌకర్యాలు కల్పించడం వల్ల రాష్ట్ర ప్రభుత్వానికి సాలుకు పదిహేను లక్షల రూపాయిలమేరకు ఆదాయం తగ్గుతుంది. ఈ పదిహేను లక్షల రూపాయిల తగ్గుదలను భర్తీచేయడానికి దాదాపు కోటి రూపాయిలు ఆదాయాన్నివ్వగల కొత్తపన్నును విధించడానికి రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది. కొనుగోలు పన్ను విధింపు వల్ల ప్రభుత్వానికి ముప్ఫయి అయిదు లక్షల రూపాయిలు మాత్రమే ఆదాయం వస్తుందని అంచనా వేశారు. ఈ అంచనా సరిగాదని, కొత్తపన్ను వల్ల వచ్చే ఆదాయం ఈ అంచనాను మించి చాలా ఎక్కువ వుండ గలదని ఆంధ్ర - తెలంగాణాలు ఒకే రాష్ట్రంగా ఏర్పడనున్న సమయంలో కొత్త పన్నును విధింప సంకల్పించడం రాజనీతిజ్ఞత కాదని హెచ్చరించితిమి. మొదటి అంచనా సరిగాదని, కొత్త పన్నులవల్ల వచ్చే ఆదాయం మొదటి అంచనాకు రెండు, మూడు రెట్లు వుంటుందని ఇప్పటి అంచనా స్పష్టం చేసింది.

ఈ కొత్త పన్నులు ఏవీ రైతుల మీద పడవని ప్రభుత్వం ఇస్తున్న హామీ కూడా ఈ అంచనాల్లాగానే వుంటుందని, ప్రభుత్వం ఎన్ని హామీలు ఇచ్చినా ఆచరణలో ఈ పన్నులను అటు పంటదారులు, ఇటు వినియోగదారులు చెల్లింపవలసి వుంటుందని ఇదివరకే స్పష్టం చేసివున్నాము. వరిధాన్యంపై విధించే పన్నును కొనుగోలుదార్లు పంటదారులనుంచే రాబడ తారనేది నిస్సందేహం. ప్రస్తుతం రాష్ట్రంలో ధాన్యం ధర బస్తా ఒకటికి ఇరవై రెండు రూపాయిల వరకూ వున్నట్లు కన్పిస్తుంది. ఈ కొత్త పన్నును వర్తకులు రైతులనుంచి వసూలు చేయనిపక్షంలో ధర కొత్తగా విధించిన పన్ను మేరకు పెరుగుతుంది. అంటే రైతులకు వారు విక్రయించే ధాన్యం ధర నిలకడగా వుండి, వినియోగదార్లు కొనే బియ్యం ధర పెరిగిపోతుంది. అలాగాక వర్తకులు రైతులనుంచి ధాన్యం కొనే సందర్భంలో రూపాయికి అర్ధణా చొప్పున ధరను తగ్గించితే రైతులకు గిట్టే ధర తగ్గిపోతుంది.

ఈ పన్నువసూలు ఏ పద్ధతిలో జరిగినా భరించేవారు వర్తకులు మాత్రం గాదు. వర్తకులు రైతులనుంచి తక్కువ ధరకు కొని పన్ను చేర్చి ఎక్కువ ధరకు విక్రయింపవచ్చును. ఈ విధంగా కొనుగోలు పన్ను ఒక దశలోనే వసూలు కావాలని శాసనం స్పష్టం చేసినా ఆచరణలో రెండుదశల్లో వసూలు కావచ్చును. అయితే ప్రభుత్వానికి మాత్రం ఒకదశలో వసూలయ్యే పన్నుమాత్రమే జమ కావచ్చును; కాని వినియోగదారులకు మాత్రం బియ్యంధర, ప్రస్తుత పన్ను ప్రమాణాన్ని బట్టి, రూపాయికి అణాన్నర వరకూ పెరగవచ్చును. ఆహార పదార్థాలపై ఏవిధమైన పన్నూ వుండరాదని ఎంతకాలంగానో ఆందోళన జరుగుతూ వుంటే రాష్ట్ర ప్రభుత్వం కొత్తపన్నును విధించడం ఏవిధంగా చూచినా సమర్థనీయం గాదు. వరిధాన్యాన్ని, బియ్యాన్ని ఈ పన్నునుంచి మినహాయించడం అత్యవసరం.

ఈ కొత్త పన్ను వల్ల 'ఆంధ్ర-తెలంగాణా' రాష్ట్రం ఏర్పడిన తరువాత దొంగ వ్యాపారం అధికమయ్యే ప్రమాదం కూడా వుంది. ఈ పన్ను రాష్ట్రం అంతటా అమలు జరుగదు. కొత్త పన్నులకు తెలంగాణా ప్రజలు సుముఖంగా లేరు. ఆహారధాన్యాల రవాణాపై ఏ విధమైన నిబంధనలూ లేవు. ఏటన్నింటి దృష్ట్యా రాష్ట్ర ప్రభుత్వం ఈ కొత్త పన్నుల విధింపును నూత్న రాష్ట్రం రూపొంది, ప్రభుత్వం స్థిరపడే వరకూ వాయిదా వేయడం వాంఛనీయం. ఉచిత విద్యాబోధనలవల్ల ఆదాయంలో వచ్చే తగ్గుదల పదిహేను లక్షల రూపాయిలే గనుక, మొదటి సంవత్సరం ఈ తగ్గుదలను భర్తీ చేయడానికి కొత్త పన్నును విధింపనవసరం లేదు. ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాలను అన్ని రంగాల్లోనూ ఒకే స్థాయికి తీసుకురావడానికి ఎంతో చేయవలసివున్నది. తెలంగాణా ప్రజలు ఇప్పటికే ఎక్కువ పన్నులను చెల్లిస్తున్నారని, ఇక వారు కొత్తపన్నులను చెల్లింపలేరని హైద్రాబాదు మంత్రులు స్పష్టం చేశారు. ఒకే రాష్ట్రంలో ప్రాంతాని కొక విధమైన పన్నులను విధించడం సమంజసంగాదు. కనుక ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాల్లో ప్రస్తుతం అమలులో వున్న పన్నులను పరిశీలించి సమన్వయపరచడానికే ఇప్పుడు ప్రయత్నించాలి.

## కాంబోడియాపై వియత్నాం దాడులు

### మంత్రివర్గం రాజీనామా

కాంబోడియా, మార్చి 31: దక్షిణ వియత్నాం సైన్యాలు, కాంబోడియా భూభాగంపై పదేపదే దాడులు చేస్తూ, గ్రామాలను దోచుకొని, ప్రజలను ఎత్తుకొని పోతున్నాయని కాంబోడియా ప్రధానమంత్రి సిహానోక్ మొన్న రాత్రి ప్రకటించారు.

దక్షిణ వియత్నాం, కాంబోడియాకు, తమ దేశానికి ఉన్న సరిహద్దును మూసివేసిందని, తమ ప్రభుత్వంగూడా ప్రతీకార చర్య తీసుకొని మార్చి 26 న సరిహద్దు బందు చేసివేసిందని, సిహానోక్ తెలియజేశారు.

ఈ దాడుల విషయమై అధిక్షేపణ తెలిపినా ప్రయోజనం లేకపోయిందని ప్రస్తుత ఉద్రిక్త పరిస్థితిగురించి ప్రభుత్వం త్వరలో అధికార ప్రకటన చేయవచ్చునని ఆయన అన్నారు.

కాంబోడియారాజా, సిహానోక్ మంత్రివర్గం రాజీనామాను, నిన్న అంగీకరించారు.

24 వ తేదీనే మంత్రివర్గం యీ రాజీనామా అందజేసింది. అమెరికా ప్రాపకులు ఇటు థాయిలాండ్, అటు దక్షిణ వియత్నాంలకు కాంబోడియాపైన పూరిగొల్పి వత్తిడిచేస్తున్నందున తను (ప్రధానమంత్రి) పెకింగ్ వెళ్ళి వచ్చినది లగాయతు, యీ వత్తిడి మరీ ఎక్కువైనందున, మంత్రివర్గం రాజీనామా చేయవలసి వచ్చినట్లు రాజీనామా పత్రంలో తెలియజేశారు.

# కంపెనీల శాసన నిర్వహణ సలహా సంఘ బాధ్యతలు

### [శ్రీ కె. ఆర్. పి. అయ్యంగార్]

(కంపెనీల శాసనం నిర్వహణశాఖ సంయుక్త కార్యదర్శి)

కంపెనీలకు సంబంధించిన వ్యవహారాలను అమోదించడంలోను, కంపెనీల వ్యవహారాలనుచక్కదిద్దడంలోను 1956 సంవత్సరపు కంపెనీల శాసనంద్వారా ప్రభుత్వానికి సంక్రమించిన విస్తృతాధికారాలను, ప్రభుత్వం నిరంకుశంగా అములుజరపడానికి వీలు లేదు. అందువల్ల, కంపెనీల శాసనంలోని 411 వ సెక్షనులో ఉదహరించిన విషయాలలో అధిక భాగాన్ని పరిష్కరించడానికి కేంద్ర ప్రభుత్వం 410 వ సెక్షనుక్రింద ఏర్పరిచే ప్రత్యేక సంఘం సలహా ను పొందవలసి ఉన్నది.

క్రొత్త కంపెనీల శాసనం ప్రకారం సలహా సంఘంలోని సభ్యుల సంఖ్య ఐదింటికి మించి వుండకూడదు. వారందరూ తగిన అర్హతలు గలిగి వుండాలి. ఆ ఐదుగురిలో ఒకరిని సలహా సంఘం అధ్యక్షుడుగా నియమిస్తారు. క్రొత్త శాసనంలోని ఈనిబంధన 1913 వ సంవత్సరపు కంపెనీల శాసనంలోని 289-బి సెక్షనును పోలి వున్నది. పాత శాసనం ప్రకారం సెలకొల్పిన ప్రత్యేక సంఘం వ్యవహారాన్ని అవలోకిస్తే, కంపెనీల శాసనం నిర్వహణలో అట్టి చట్టబద్ధమైన సంస్థ ఏట్టి పాత్రను నిర్వహించగలదో అందరికీ అర్థమౌతుంది.

### తొలిసలహా సంఘం

పాత కంపెనీల శాసనంక్రింద మొదటిసలహా సంఘం 1951 లో ఏర్పడింది. 1951 కంపెనీల (సవరణ) శాసనంద్వారా కంపెనీల నిర్వహణలోని దుర్నడతలను, అవకతవకలను సరిదిద్దడానికి కేంద్ర ప్రభుత్వానికి పార్లమెంటు విస్తృతాధికారాలు ఇచ్చింది.

కంపెనీల డైరెక్టర్లబోర్డు, లేక మేనేజింగు ఏజెన్సీల విషయంలో వారి ప్రతిఫలం విషయంలోగాని, నియామకం విషయంలోగాని, ప్రస్తుత పదవులను మరికొంతకాలం పొడిగించేవిషయంలోగాని ఏవైనా మార్పులు చేయదలిస్తే ముందుగా ప్రభుత్వామోదం పొందాలని 1951 శాసనం, కంపెనీల శాసనానికి కొన్ని ముఖ్యమైన నిబంధనలను చేర్చింది. కంపెనీ పాలకవర్గంలో కొద్దిమంది వ్యక్తులు ఏదోవిధంగా మెజారిటీ సంపాదించుకుని, తమ ఉనికికి భంగం లేకుండా చేసుకొని, కంపెనీల వాటాదార్లపై అధిపత్యం సంపాదించి, కంపెనీ శ్రేయస్సునుగాక, స్వప్రయోజనాలకోసం పాటుపడే స్వార్థపరుల ఆట కట్టించడానికి ఈశాసనం ప్రభుత్వానికి అధికారాన్ని ఇచ్చింది.

పై నిబంధనలు ఈశాసనంలో చేర్చబడిన తర్వాతకూడా కంపెనీలశాసనం నిర్వహణలో కొన్ని ఇబ్బందులు రాకపోలేదు. కంపెనీల శాసనం నిర్వహణను రాష్ట్రప్రభుత్వాలు కేవలం ఏజెంట్ల మాదిరి వ్యవహరిస్తూండడం, అశాసనం నిర్వహణలో సరైన సలహాలిచ్చి, దోవ చూపించడానికి కేంద్రప్రభుత్వ సిబ్బంది దిగలశాఖ లేకపోవడం ఆలోపాలకు కారణాలైనాయి.

అతి క్లిష్టవిషయాలతో కూడిన ఈ శాసనాన్ని సమర్థంగా అమలు జరపడానికి వ్యాపారనిర్వహణలో విశేషానుభవం, దూరదృష్టివున్న వారు కావాలి. ఇట్టివిషయాలలో నిర్ణయాలు చేయడానికి సివిలుసర్వీసు ఉద్యోగులకు సాధ్యంగాదు. అందువల్ల అట్టి విషయాలలో ప్రభుత్వానికి సలహాఇవ్వడానికి చట్టబద్ధమైన సలహాసంఘం అవసరమని గుర్తించారు.

అయితే, బ్రిటనులో ఈమాదిరి అధికారాలను ఉపయోగించవలసిన సందర్భాలు రాలేదు. ఇతర విషయాలను గురించి ప్రభుత్వం నిర్ణయం తీసుకునే ముందు, సలహాసంఘాల సహాయాన్ని తీసుకుంటుంది. కంపెనీల నిర్వహణకు సంబంధించిన నిర్ణయాలను గురించిన విషయాలు అతిముఖ్యం కావడంవల్ల, చట్టబద్ధమైన సలహాసంఘ నియామకం అవసరమైంది. ఈ సందర్భంలో ఒక విషయం జ్ఞాపకం చేస్తున్నాను. 1952 లోనే కంపెనీల శాసనం కమిటీవారు కంపెనీల శాసనాన్ని నిర్వహించడానికి ఒక చట్టబద్ధమైన సంస్థను నెలకొల్పాలని సిఫారసుచేశారు. ఆసిఫారసుపై పార్లమెంటు జాయింటు సెలెక్టుకమిటీ వెలిబుచ్చిన అభిప్రాయం మేరకు, ప్రభుత్వము ఆ సిఫారసును అంగీకరించలేదు. పాతకంపెనీల శాసనంక్రింద ఏర్పడిన సలహాసంఘాన్ని పోలిన సలహా సంఘాన్ని ఈ క్రొత్త శాసనం చట్టబద్ధంగా నెలకొల్పిందన్నమాట.

మొట్టమొదటి సలహా సంఘానికి అధ్యక్షులు శ్రీ హెచ్. వి. భాభా. ఆయన అంతకుముందు కంపెనీలశాసనం సవరణలకు ఏర్పడిన ప్రత్యేకసంఘానికి అధ్యక్షులుగా పనిచేశారు. ఆ సలహా సంఘంలోని ఇతరసభ్యులు యిప్పటి కంపెనీల శాసనం కమిటీ కార్యదర్శి శ్రీ పి. యల్. మజుందార్ (ఆయన ప్రస్తుతం కంపెనీలశాసనం నిర్వహణ శాఖ కార్యదర్శిగా వున్నారు) రిజర్వు బ్యాంకు డిప్యూటీగవర్నర్ శ్రీ యన్. సుందరేశన్. ఆ సంఘం కంపెనీల నిర్వహణకు సంబంధించిన పరిపాలనా వ్యవహారాలను చూస్తూ, ప్రశంసనీయమైన కృషిచేసింది. 1951 కంపెనీలశాసనం నిర్వహణనుగురించి ప్రభుత్వం ప్రచురించిన వార్షిక సమీక్ష ఆ సలహా సంఘం కృషిఫలితమే.

### కొత్త సలహాసంఘం

శ్రీ భాభా అధ్యక్షతక్రింద ఏర్పడిన సలహాసంఘం 1956 ఫిబ్రవరి 21 న రాజీనామా ఇచ్చింది. అప్పుడు కేంద్ర ప్రభుత్వం శ్రీ తెన్నేటి విశ్వనాథం అధ్యక్షతక్రింద క్రొత్త సలహాసంఘాన్ని నెలకొల్పింది. శ్రీ జె. డి. ఘోష్, శ్రీ జి. డి. అంబేకర్ ఈ సంఘంలో సభ్యులు, శ్రీ బి. యన్. చతుర్వేది, శ్రీ సి. యస్. శాస్త్రి క్రొత్త సంఘానికి సలహాదార్లు.

ఏప్రిల్ 1-వ తేదీన క్రొత్తశాసనం అమలులోకి రాగానే, పైన పేర్కొన్న అందరి సభ్యులతో క్రొత్తసంఘం పనిచేస్తుంది.

### విధి బాధ్యతలు

ఈ సలహాసంఘం కేంద్రప్రభుత్వానికి అనేకవిషయాలలో సలహాఇస్తుంది. ఒక నిర్ణీత తరగతికి చెందిన పరిశ్రమలకు మేనేజింగు ఏజెన్సీలు ఉండవలసిన అవసరంలేదని ప్రభుత్వప్రకటన జారీచేయడానికి పూర్వం, అట్టి ప్రకటన అవసరమా, లేక, ప్రయోజనకరమా అనే విషయాన్ని నిర్ణయించడానికి ముందు కేంద్రప్రభుత్వం ఈ సలహాసంఘాన్ని సంప్రదిస్తుంది.

పబ్లిక్, లేక ప్రయివేటు కంపెనీలకు సంబంధించిన ఈ క్రిందివిషయాల సందర్భంలో కేంద్ర ప్రభుత్వానికి వచ్చిన దరఖాస్తులను పరిశీలించడానికి కూడ ఈ సలహాసంఘాన్ని సంప్రదిస్తుంది.

1. ఆ కంపెనీ నిబంధనావళిలో పేర్కొనబడిన సంఖ్యకు మించి డైరెక్టర్ల సంఖ్యను పెంచదలచినప్పుడు:

2. కంపెనీ నిబంధనావళి, లేక, ఒప్పందం, లేక సర్వసభ్య సమావేశం తీర్మానంలోగాని డైరెక్టరు నియామకం, లేక, మేనేజింగు డైరెక్టరు, పూర్తికాలపు డైరెక్టరు, వరుసక్రమంలో రిటైరుగాని డైరెక్టరును తిరిగి నియమించే సందర్భాలలోను;

3. మేనేజింగు డైరెక్టరులేక పూర్తికాలపు డైరెక్టరు నియామకం విషయంలోను;

4. డైరెక్టరు, మేనేజింగు డైరెక్టరు, పూర్తికాలపు డైరెక్టరు, లేక మేనేజరుయొక్క ప్రతిఫలాన్ని పెంపుచేసే సందర్భంలోను.

5. ఈ క్రింది విషయాలను గురించి అన్ని కంపెనీలు తప్పనిసరిగా సంప్రతించాలి. మేనేజింగు డైరెక్టరు, లేక, హోల్ టైము డైరెక్టరు, ప్రతిఫలాన్ని ఎక్కువ చేయడంగాని, తిరిగి, నియమించడం గాని, తొలిసారిగా నియమించడానికి గాని;

6. మేనేజింగు ఏజెంట్లు, సెక్రటరీలు, ట్రెజరర్ల నియామకం.

7. ప్రస్తుత పదవీ కాల పరిమితి 2 సంవత్సరాలు, లేక, అంతకు మించి వుండగా, మేనేజింగు ఏజెంట్లను గాని, సెక్రటరీలనుగాని, ట్రెజరర్లనుగాని తిరిగి కొంతకాలం నియమించడానికి;

8. మేనేజింగు ఏజెంట్లు, లేక సెక్రటరీలు, ట్రెజరర్లతో చేసుకొన్న ఒప్పందంలో మార్పులు సంభవిస్తేనూ;

9. మేనేజింగుఏజంటుగా ఒకేసారి ఇన్ని కంపెనీలలో వుండవచ్చుననే నిబంధనను ఆ వ్యక్తి ఉల్లంఘించినప్పుడు, ఆ వ్యక్తిని మేనేజింగు ఏజెంటుగా వుండడానికి ఆ కంపెనీలు నిర్ణయించే టప్పుడు;

10. మేనేజింగు ఏజెంట్లు, ట్రెజరర్లు, సెక్రటరీల పదవుల మార్పు సందర్భంలోను, క్రొత్తవారిని నియమించిన సందర్భాలలోను;

11. మేనేజింగు ఏజెంటుగావున్న సంస్థ, లేక, సెక్రటరీ కార్యదర్శి పదవుల నిబంధనావళిలో మార్పులు చేసే సందర్భంలోను;

12. 198, 348 సెక్షనులు, 348 వ సెక్షనులో 381 సెక్షను కలిపి చదివినప్పుడు, ఆ సెక్షనులలో పేర్కొనబడిన పరిమితిని మించి ప్రతిఫలం అదనంగా ఇవ్వదలిచినప్పుడు;

13. కంపెనీ శ్రేయస్సుకుగాని, ఆ కంపెనీయొక్క ఏ సభ్యుని శ్రేయస్సుకు భంగం కలిగే పరిస్థితులలో వాటిని నివారించడానికి ప్రభుత్వం డైరెక్టర్లను నియమించే విషయంలోను;

14. పబ్లిక్ కంపెనీలోగాని, ఒక పబ్లిక్ కంపెనీకి అనుబంధంగా వున్న ఒక ప్రయివేటు కంపెనీలోగాని డైరెక్టర్ల బోర్డులో మార్పు జరిగితే కేంద్ర ప్రభుత్వం ఆమోదిస్తే తప్ప అవి చెల్లుబడి కావని కేంద్రప్రభుత్వ ఉత్తర్వు జారీచేసే సందర్భంలోను!

కేంద్ర ప్రభుత్వం అవసరమని తోచిన విషయాలలో ఈ సంఘం నుంచి సలహాను పొందుతుంది.

### దరఖాస్తులు

పైన పేర్కొన్న విషయాలలో కేంద్ర ప్రభుత్వం అనుమతి పొందడానికి పంపే దరఖాస్తులు ప్రత్యేక ఫారములలో వుండాలి. ఆ ప్రత్యేకఫారాల వివరాలు కేంద్రప్రభుత్వ ప్రధాన నిబంధనలు, ఫారాలు 1956 నుంచి తెలుసుకోవచ్చును. కంపెనీలు అట్టి దరఖాస్తులను కేంద్రప్రభుత్వానికి పంపేముందు ఆ కంపెనీ ఆ విషయాలను సవివరంగా నోటీసుల మూలంగా వాటాదార్లకు తెలియచేయాలి. ఆ నోటీసు ఒక ఇంగ్లీషు వార్తా పత్రికలోను, ఆకంపెనీ ఎక్కడ వున్నదో ఆజిల్లా ప్రధాన భాషలోను ప్రచురించాలి. ఆ నోటీసు ప్రతిని ప్రభుత్వానికి పంపే దరఖాస్తుతో విధిగా జతపర్చాలి. మేనేజింగు ఏజెంట్ల ట్రెజరర్ల సెక్రటరీల నిబంధనావళిలోని మార్పులను సంబంధించి పంపే దరఖాస్తుల విషయంలో ఆ నోటీసును మేనేజింగు ఏజెంట్లు, అసలు కంపెనీరెండూ ప్రచురించాలి.

కేంద్ర ప్రభుత్వానికి దరఖాస్తులతో పాటు ఈ క్రిందివి కూడ పంపాలి.

1. కంపెనీ నిబంధనావళి ప్రతులు ఏడు. (మేనేజింగు ఏజెంటుగా వుంటే కంపెనీయొక్క, అసలుకంపెనీయొక్క, ట్రెజరర్లు లేక సెక్రటరీల కంపెనీల యొక్క)

2. డైరెక్టర్ల నివేదిక గడిచిన మూడు సంవత్సరాలకు ఆడిటర్ల చేత తనిఖీ కాబడిన లెక్కల ప్రతులు ఏడు.

3. మేనేజింగు ఏజెంట్లు లేక సెక్రటరీలు, ట్రెజరర్లు, మేనేజింగు డైరెక్టర్లు చేసుకునే ఒడంబడిక ప్రతులు ఏడు.

4. మేనేజింగు ఏజన్సీ లేక సెక్రటరీ, ట్రెజరరు సంస్థలు చేసుకొనే భాగస్వామ్యపు ఒడంబడికల ప్రతులు ఏడు.

5. డైరెక్టర్ల బోర్డు వివరాలు, డైరెక్టర్ల వ్యక్తిగతవాటాల వివరాలు గల జాబితాలు.

6. డైరెక్టర్ల బోర్డు, లేక, సర్వసభ్య సమావేశం కంపెనీ ప్రతిపాదనను అంగీకరించవల్సిందిగా ప్రభుత్వాన్ని కోరడానికి చేయబడిన తీర్మానం ప్రతి.

198 వ సెక్షనులో మేనేజింగు ఏజెన్సీ ప్రతిఫలం విషయంలో పరిమితి నిర్ణయించినందున దరఖాస్తులు పంపే కంపెనీలన్నీ, ఆ నిర్ణయం కష్టనష్టాలను ఈ సలహాసంఘానికి నివేదించాలి. ఈ విధి బాధ్యతల నిర్వహణలో సలహా సంఘానికి విస్తృతాధికారాలను ఇచ్చారు. కంపెనీల రికార్డును తనిఖీ చేయడానికి అధికారమున్నది. కంపెనీల మేనేజింగు డైరెక్టరు, లేక, డైరెక్టరు, లేక, సెక్రటరీని అవసరమని తోచే పక్షంలో ఈ సంఘం ఎదుట హాజరుకావాలని సంఘం ఆదేశించవచ్చు. కంపెనీ ఆదేశాలను ధిక్కరిస్తే, రెండుసంవత్సరాలవరకూ శిక్ష విధించబడవచ్చు.

శాసనం మేరకు అవసరమైన విషయాలలో ప్రభుత్వామోదం పొందవలసిన సందర్భాలలో కంపెనీలు పంపే దరఖాస్తులను వెంటనే పరిశీలించడం జరుగుతుంది.

# పెట్టుబళ్ల కంట్రోలు

### శ్రీ ఎమ్. ఆర్. భిడే, ఐ. సి. ఎస్.

[ఆర్థికశాఖ కంపెనీల చట్ట నిర్వహణ విభాగం: సంయుక్త కార్యదర్శి]

1943 మే నెలకు పూర్వం శలములో కంపెనీలు జారీచేసే పెట్టుబళ్లపై కంట్రోలు ఉండేదికాదు. 1939 వ సంవత్సరపు ఇండియా రక్షణ చట్టం కింద కంట్రోలు విధిస్తూ ఆ నెలలోనే ఒక నిబంధన జారీ చేయబడింది. తొలి పంచవర్ష ప్రణాళికను రచించిన తర్వాత నుంచీ, డబ్బును సవ్యమైన మార్గాలలోకి పెట్టుబడి రూపముగా మళ్లించడం మరింత అవశ్యకమయింది. అధికారిక దేశంలో పారిశ్రామిక సంస్థల కింద పెట్టుబడి పెట్టడానికి లభ్యమయ్యే డబ్బుకూడా చాలా పరిమితం. నిర్ణీతమయిన కార్యక్రమం ప్రకారం డబ్బును ఆయా మార్గాలలోకి తగు పరిమాణాలలో మళ్లించడం ఎంతైనా అవసరం. కొన్ని రకాల పరిశ్రమలలో పెట్టుబడిని కంట్రోలు చేయడానికి 1951 వ సంవత్సరపు పరిశ్రమల అభివృద్ధి చట్టం లైసెన్సు పద్ధతిని ప్రవేశపెట్టారు. ఈ పద్ధతి 1952, సెప్టెంబరు నుంచి అమలులోకి వచ్చింది. దీని ప్రకారం పారిశ్రామికులు ఈ క్రింది పనులకు లైసెన్సులు పొందవలసి వుంటుంది.

1. కొత్త పారిశ్రామిక సంస్థలను నెలకొల్పడం, 2. ఉన్న సంస్థలను విశేషంగా అభివృద్ధి పరచడం, 3. కొత్త వస్తువుల తయారీ.

చట్టం మొదటి షెడ్యూలులో పేర్కొనబడిన 42 రకాల పరిశ్రమలకు ఈ చట్టం వర్తిస్తుంది. ఆ పరిశ్రమలు విద్యుత్తుతో నడిచేవి గనుక అయితే 50 మంది పైగా కార్మికులూ, విద్యుత్తుతో నడవనివి గనుక అయితే, 100 మందికి పైగా కార్మికులు పనిచేస్తున్నపుడు మాత్రమే చట్టం వర్తిస్తుంది.

1947 నాటి పెట్టుబళ్ల అదుపు చట్టాన్ని ఇటీవలివరకు ఏటేటా పొడిగిస్తూ వచ్చారు. పార్లమెంటు ప్రస్తుత సమావేశం ఆ చట్టాన్ని శాశ్వతం చేసింది. ఇట్టి కంట్రోలు ఆవశ్యకమని పార్లమెంటు సభ్యులంతా ఏకగ్రీవంగా అభిప్రాయ పడుతున్నట్లు చర్చాక్రమంలో స్పష్టమయింది.

పరిశ్రమల అభివృద్ధి అదుపు చట్టముక్రింద పరిశ్రమలకు లైసెన్సులను జారీచేయడం అనే పద్ధతి ఎలాగూ అములులో ఉంది గనుక, మళ్ళీ విడిగా పెట్టుబడుల సేకరణపై కంట్రోలు విధించడం అనవసరమని కొందరు వాదిస్తారు. కాని అసలు సంగతి సరిగా తెలియక పోవడం వల్లనే వారు అలా వాదించడం జరుగుతోంది. అసలు ఈ పరిశ్రమల అభివృద్ధి అదుపు చట్టము 42 పరిశ్రమలకు మాత్రమే వర్తిస్తుంది. దీని పరిధిలోకి రాని పరిశ్రమల సంఖ్య బహుళం. ఏటికితోడు, తోటల కంపెనీలు, బ్యాంకింగు, భీమా కంపెనీలు, పారిశ్రామికేతర కంపెనీలకుకూడా ఈ చట్టం వర్తించదు.

వాణిజ్య పారిశ్రామిక సంస్థలన్నిటిలోనూ బోనసు వాటాలను కూడా ప్రభుత్వ కంట్రోలు చేయవలసి వుంటుంది. పరిశ్రమల అభివృద్ధి, అదుపు చట్టం వర్తింప చేయబడే 42 రకాల పరిశ్రమల విషయంలో కూడా పెట్టుబళ్ల కంట్రోలు చట్టం ద్వారా పర్యవేక్షించవలసిన ఆర్థిక సాంకేతిక అంశాలు అనేకం ఉంటాయి. పన్నుల ద్వారానూ, పరపతి కంట్రోలు ద్వారానూ, ప్రైవేటు రంగంలో పెట్టుబళ్ళను తగు పరిమాణాలలో అవసరమైన మార్గాల్లోకి మళ్లించడం పెట్టుబడి కంట్రోల్ చట్టం ముఖ్య లక్ష్యం.

ఈచట్టం ద్వారా అవాంఛనీయమైన పరిశ్రమల కింద డబ్బు పెట్టుబడి పెట్టకుండా చూడడమే తప్ప, అంతకంటె ప్రస్తుతం వేరే సాధిస్తున్నది ఏమీ లేదని కొందరు అంటున్నారు. ఈ మాటలో కొంత నిజం లేకపోలేదు. అధికారిక, ఏ పరిశ్రమలకు ముందుగా ఎక్కువ పెట్టుబడి పెట్టాలో, దేనికి తక్కువ పెట్టాలో, గమనించి ఆప్రకారం చేయడం ఈచట్టం కిందసాధ్యంకాదు. అసలు మొత్తం పరిశ్రమల కింద ఎంత పెట్టుబడి లభ్యమౌతుంది? పెట్టుబడి మార్కెటు పరిస్థితి ఎలా ఉంది అనే వివరాలు సమగ్రంగా తెలిస్తేనే తప్ప లేకపోతే పైన చెప్పిన విధంగా కట్టుదిట్టమైన కంట్రోలు విధించడం సాధ్యం కాదు. ప్రస్తుత చట్టం కింద బ్యాంకింగు కంపెనీలు, భీమా కంపెనీలు తప్ప, తక్కిన అన్ని తరహాల కంపెనీలు అనుమతి లేకుండానే ఒక ఏడాదిలో రు 50 లక్షల పెట్టుబడిని జారీచేయవచ్చు. 1 లక్ష మాత్రమే అనుమతిలేకుండా జారీ చేయనివ్వాలనీ, అంతకంటే ఎక్కువ మొత్తాలపై కంట్రోలు విధించాలని కొందరు సూచించారు. కాని ఈ సూచన ప్రస్తుత పరిస్థితులలో ఆచరణ సాధ్యం కాదు.

1955 డిసెంబరు వరకు 125 కోట్ల 30 లక్షల రూపాయలు పెట్టుబడి జారీ అయింది. 23 కోట్ల 20 లక్షల రూ. పెట్టుబడి మొత్తాన్ని జారీ చేయడానికి అనుమతి కోరుతూ 85 మంది పెట్టుకొన్న దరఖాస్తులను నిరాకరించారు. 22 కోట్ల 40 లక్షల విలువ పెట్టుబడికి అనుమతి కోరుతూ దాఖలు అయిన 128 దరఖాస్తులను ఆమోదించారు. 30 దరఖాస్తులను నిరాకరించారు.

1953, 1954, 1955, సంవత్సరాలలో 40 కోట్ల 80 లక్షల పెట్టుబడిని అనావశ్యకమైన పరిశ్రమల క్రింద పెట్టకుండా నివారించడం జరిగింది.

పెట్టుబడి కంట్రోలు చట్టాన్ని కంపెనీ చట్ట పరిపాలన శాఖవారే అమలు జరుపుతారు. జమ్ము-కాశ్మీరు తప్ప తక్కిన యావద్దేశానికి ఈచట్టం వర్తిస్తుంది. దేశంలోని అందరు వ్యక్తులకు, విదేశాలలో నివసించే భారతీయ పౌరులకు కూడా ఇది వర్తిస్తుంది.

1940 వ సంవత్సరం చివరి పాదం వరకు బోనసు వాటాలను ఇంచుమించు నిర్నిబంధంగానే అనుసరిస్తూ వచ్చారు. కాని 1947 వ సంవత్సరాంతములో 5 లక్షల వరకు బోనసువాటాలను జారీ చేయడానికి లోగడ యిచ్చిన అనుమతి ఉపసంహరింపబడింది. ఏ కంపెనీ విషయంలోనూ చెల్లించిన మూలధనం మరీ ఎక్కువగానూ, రిజర్వునిధి అతి స్వల్పంగానూ ఉండరాదని ప్రభుత్వంఅభిమతం.

1956-57 వ సంవత్సరపు బడ్జెటులో వేసిన పన్ను ప్రతిపాదనబట్టి, బోనసు వాటాపై 1 రూపాయికి రెండు అణాల వంతున పన్ను విధించబడుతుంది. బోనసు వాటాలపై పన్ను విధించాలా? లేదా అనేవివాద అంతిమైనట్లే భావించవచ్చు. పెట్టుబళ్ల కంట్రోలు నిర్వహణ విషయమై ప్రతిమూడు నెలలకు ఒకసారి సవివరంగా నివేదికలు జారీ అవుతూ ఉంటాయి. ప్రతి సంవత్సరాంతాన సమగ్రమైన సమీక్ష జరుగుతుంది.

ఏ కంపెనీకైనా పెట్టుబడి జారీచేయడానికి అనుమతి ఇచ్చినప్పుడు కోరిన మొత్తాన్ని సేకరించడానికి 24 నెలల గడువు లభ్యమవుతుంది. ఈవిధంగా అనుమతి ఇచ్చినకంపెనీలు మొదటి సంవత్సరాంతంలోనూ, తరువాత ప్రతి ఆరునెలలకు ఒకసారి పెట్టుబళ్ల కంట్రోలు శాఖకు నివేదికలు పంపిస్తూ ఉండాలి. కాని కంపెనీ జారీ క్రమ పద్ధంగా నివేదికలు పంపించడం లేదు. అయితే జాయింటు స్టాకు కంపెనీల రిజిస్ట్రార్ల ద్వారా ఆ సంస్థల తనిఖీలు తీసుకుంటున్నారు. ఇకవిూద పెట్టుబడి సేకరణ విషయమై ఎప్పటికప్పుడు సమాచారం సేకరించడం సులభ సాధ్యమవుతుంది.

# తిని కూర్చునే వారి వ్యాధి

### చికిత్సకు లొంగని గుండె జబ్బు

టోకియో, మార్చి 30: ఇకముందు పనిపాటు లేనివారు ఎక్కువగా హృద్రోగంలోనే పడిపోతారని గుండె వ్యాధి నిపుణుడు శ్రీ పాల్ డడ్లీవైట్ నేడు అమెరికన్, జపానీస్ వైద్యుల సమావేశంలో చెప్పారు. రక్తనాళాలలో రక్తం ఘనీభవించడం వలన మరణిస్తారని, యీ వ్యాధే ఎక్కువగా కారణమవుతుందని తెలిపారు.

క్షయ, నారికురుపు, వ్యాధులకు చికిత్సకనుగొన్నా యీ వ్యాధికిమాత్రం యింకా సరియైన చికిత్స తేలలేదన్నారు.

ఈ వ్యాధికి కారణం, బాగా కడుపునిండా భుజించడం, ఏమాత్రం వ్యాయామం చేయకుండా సుకుమారంగా మెలగడం" అని చెప్పారు.

# అణ్వస్త్రాలు వాడరాదని ఒప్పందం

### శ్రీ రస్సెల్ సూచన

మాస్కో, మార్చి 29: అణు బాంబులను నిషేధించడం విషయమై ఒప్పందం చేసుకోవడం సాధ్యమేనని శ్రీ బెర్ట్రాండ్ రస్సెల్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక ప్రావ్దాలో ఒక వ్యాసం వ్రాశారు.

ఇటువంటి ఏర్పాటును చేసుకోడానికి కమ్యూనిస్టు, కమ్యూనిస్టు వ్యతిరేక దేశాల ప్రతినిధులు, తటస్థ రాజ్యాల ప్రతినిధులు సమావేశం కావాలని, ఇందులో కమ్యూనిస్టు వ్యతిరేక దేశాలకు సమాన ప్రాతినిధ్యం వుండాలని, వీరి మధ్య పెడికట్టుగా తటస్థ రాజ్యాలు పనిచేస్తాయని ఆయన సూచించారు.

ఇలాంటి సభ ఈఒక్క విషయాన్నేగాక ప్రపంచంలో ఉద్రేకాన్ని కలిగిస్తున్న సర్వవిషయ స్థితులను ఉపశమింపచేట్లు చేయ్యడానికి గూడా పని చేయగలదని శ్రీ రస్సెల్ భావిస్తున్నారు.

"ఇప్పుడు ఇరువర్గాల వద్ద అణ్వస్త్రాలు వున్నాయి గనుక ఏ వర్గం యుద్ధాన్ని ప్రారంభించే ఆలోచనలకు పూనుకోరు. వీటిని నిషేధిస్తే లేక నాశనం చేసివేస్తే యుద్ధం రావచ్చు. మామూలు ఆయుధాలతో అయితే ప్రపంచ వినాశనం జరగదు. గనుక, యుద్ధాలు అప్పుడు ప్రారంభం అవుతాయి.

పైగా అస్త్రాలను నాశనం చేసినా వాటిని తిరిగి సృష్టించరని నమ్మకం ఏమిటి? అందువల్ల ఒప్పందం ముఖ్యం" అని శ్రీ రస్సెల్ వాదన.

శ్రీ రస్సెల్ వ్యాసానికి శ్రీ సోలా జెవ్ ట్సేవ్ జవాబు వ్రాసారు. ఇందులో శ్రీ రస్సెల్ వాదంలో వున్న పరస్పర విరుద్ధమైన సంగతులను చూపి, ఆ వ్యాసంలోని లోపాలను చూపించారు. శ్రీ రస్సెల్ వ్యాసంలో అణువు ఆయుధాలను నిషేధించడాన్ని గూర్చి వున్నది. వాటిని నిషేధిస్తే యుద్ధం వస్తుంది అనివుంది. అంతేగాక అలాంటి నిషేధాలు, వాటిసృష్టిని అరికట్టలేదని గూడ వుంది.

# ద్వితీయ ప్రణాళిక

### నెల రోజుల్లో ఖరారు

న్యూఢిల్లీ, మార్చి 30: కేంద్ర మంత్రివర్గం, ఏప్రిల్ ఆఖరువారంలో, మూడు రోజులపాటు సమావేశమై, ద్వితీయ పంచవర్ష ప్రణాళికను ఖరారు చేస్తారు.

ఆ తరువాత, జాతీయ అభివృద్ధి మండలి, మే 1, 2 తేదీలలో సమావేశమై ప్రణాళికను చర్చిస్తారు.

మే రెండవ వారంలో, పార్లమెంటు వారం రోజులపాటు చర్చించి ఆమోదిస్తుంది.

ప్రస్తుతం ప్రకటించిన ప్రణాళిక ముసాయిదా ప్రకారం, ప్రభుత్వ యాజమాన్యంక్రింద నిర్వహింపబడే అభివృద్ధి కార్యక్రమాలకు, 4800 కోట్లు కేటాయించబడింది. ఈ దిగువ కార్యక్రమాలపై వచ్చే నష్టం పూడ్చడానికి, మరికొన్ని యితర అవసరాలకు, ఇంకో 1500 కోట్లు ఈ మొత్తమునకు చేర్చాల్సి ఉంటుంది. అంబర్ చర్ఖాలను ప్రవేశపెట్టడంవల్ల వచ్చే నష్టం రు. 280 కోట్లు మద్యనిషేధం అమలుజరపడంవల్ల వచ్చే నష్టం రు. 250 కోట్లు ఉపాధ్యాయుల జీతాలు హెచ్చించడానికి ఇచ్చే సహాయం క్రింద రు. 65 కోట్లు రైల్వేశాఖ అడిగిన మొత్తమునకు ప్రణాళిక లో కేటాయించిన మొత్తమునకు ఉన్న తేడా రు. 350 కోట్లు.

భారీ పరిశ్రమలకు— మరో 55 కోట్లు జౌళ్ల పరిశ్రమకు రు. 55 కోట్లు, నూనెగనుల పరిశ్రమకు రు. 24 కోట్లు అణుశక్తికి రు. 60 కోట్లు రక్షణశాఖ పరిశ్రమలకు రు. 400 కోట్లు.

ఈ మొత్తాన్ని సేకరించడ మెలాగో కేంద్ర ప్రభుత్వం నిర్ణయించాల్సి ఉంటుంది.

# సంపాదకునకు లేఖలు

### గుంటూరు బస్సుస్టాండు

ఆర్యా, గుంటూరు, నగరం, వ్యాపార రీత్యా, పారిశ్రామిక రీత్యా, పెద్ద కేంద్రం కావడము కారణము గా ఇక్కడనుండి పలుప్రాంతములకు బస్సులు నడుచుచున్నవి. అనుదినము అనేక వేలమంది చిలకలూరిపేట, నర్సరావుపేట, తెనాలి, పొన్నూరు, సత్తెనపల్లి, విజయవాడ, పొన్నూరు మొదలగు పట్టణములనుండి అనేక రకములైన వాణిజ్య, వర్తక, విద్య, వైద్య మొదలగు పనులమీద వచ్చి, వెళ్లుచుందురు. కాగా ప్రయాణీకులకు సరియగు వసతి సౌకర్యములు బస్సుస్టాండులో లేవు. షెడ్డులు లేవు, నిలువ నీడ, త్రాగ నీరు లభించదు. తత్కారణముగా ప్రయాణీకులు అనేక ఇబ్బందులు పడుచున్నారు. దానికి తోడు వేసవికాలము రావడముతో ప్రయాణీకుల పరిస్థితులు చాలా దుర్భరముగా నున్నవి. ఈ సందర్భములో మున్సిపాలిటీవారి బాధ్యత హెచ్చుగా ఉన్నప్పటికిని, మున్సిపల్ కౌన్సిలర్లు, పురపాలక సంఘాధ్యక్షుని "ఎక్కింపు దిగింపు" విషయములో నే నిమగ్నమైయుండుట చాలా విచారము గా నున్నది. కనుక ప్రస్తుత కమీషనరుగారు వెంటనే బస్సుస్టాండు తనిఖీ చేసి, అక్కడ పరిస్థితులను కొంతమంది బస్సు యజమానులతో సంప్రదించి ప్రయాణీకులకు అన్ని రకములైన వసతి సదుపాయములు ఏర్పరచగలందులకు ప్రార్థించుచున్నాను.

సి. యస్. రామశర్మ.

### కర్నూలు కడప కాల్వ

ఆర్యా, కర్నూలు, కడప కాల్వ 189 మైలు 15 ఫర్లాంగు వద్ద ప్రత్యేకంగా తూము పెట్టకొనుటకు అనుమతి ఇవ్వవలెనని కోరుతూ, కడప, అలాఖాన్ పల్లె, పాలంపల్లె, చిన్నమాచుపల్లె వగైరా గ్రామాదులకు సంబంధించిన రైతులు ఇప్పటికి సుమారు రెండుసంవత్సరముల క్రిందట అర్జీలు పంపుకొనియుండిరి గాని ఈ విషయములో ఇంతవరకూ ఏలాటి చర్యలు తీసుకొన్నట్లు కనపడదు. పై కనుపరచినచోట ప్రత్యేక తూము పెట్టినఎడల సుమారు 800 ఎకరాలకు నీరు పారించుకొనుటకు వీలుకలుగును, అవకాశంఉన్నచోటల్లా సాగు నిమిత్తం నీటిని వాడుకొనడానికి రైతులకు అనుమతించుటకు ఆంధ్రప్రభుత్వం నిశ్చయించుకొన్నందుకు హర్షిస్తూయున్నాము-ఆచరణలో పనులు జరుగుటలో అంతులేని ఆలస్యం జరుగుచున్నందుకు విచారిస్తున్నాము. ప్రస్తుతం మా ప్రాంతములో లెవల్ చూసి ఆయకట్టు నిర్ణయించేందుకుసర్వే చేయు ఉద్యోగులు వచ్చియున్నారు. ఇప్పుడైనా ఈ విషయములో ఏలాటి జాప్యం చేయకుండా ప్రత్యేక తూమును పెట్టించి నీటిపారుదల సౌకర్యముకల్గజేసి రైతులకు సహాయపడవలెనని కోరుచున్నాను.

జి. పెద్దిరెడ్డి, కడప.

### పెంగరగుంటలో పోస్టాఫీసు నెలకొల్పాలి

ఆర్యా, మా గ్రామంలో పోస్టాఫీసు లేని కారణంగా, సకాలంలో అందవలసిన ఉత్తరాలు, వగైరాలు, రెండు, మూడు రోజులు నిదానంగా అందుతున్నవి. అందువల్ల గ్రామస్థులు చాలా యిబ్బందులకు లోనౌతున్నారు. ప్రభుత్వమువారి కీవిషయమై యిదివరకే మహజర్లు పెట్టుకొన్నాము. కానీ, ప్రయోజనం లేకపోయినది.

ఈ గ్రామానికి వారానికి రెండు రోజులు బీటువున్నా, వి. పి., లుగానీ, మనీయార్డర్లుగానీ, వుంటే తప్ప పోస్టుమాన్ బీటు రావడంలేదు. సక్రమంగా చేర్చవలసిన ఉత్తరాలు ఒక్కొక్కప్పుడు వారందాకా చేర్చకపోవడంవల్ల గ్రామస్థులు చాలా యిబ్బంది పడుతున్నారు.

అత్యవసరంగా ఒక కార్డు వ్రాయాల్సివచ్చినా, 8 మైళ్ళ దూరంలోవున్న పలమనేరుకు వెళ్లి వ్రాసుకోవాలి.

ఇది మజరా గ్రామం. దీనికి చేరిన గ్రామాలు చుట్టుపట్ల 2 మైళ్ళలోగా వున్నవి, 1. మొసలమడుగు 2. సముద్రపల్లె 3. జంగాలపల్లె 4. కోతిగుట్ట 5. తావసపల్లె 6. వడ్డేపూరు 7. మజ్జెనూరుపల్లె 8. చేరిపల్లె 9. అగ్రహారం. ఈ గ్రామాల జనాభా 2500 పైగా ఉంటున్నారు. ప్రభుత్వమువారు ఈ గ్రామాల ప్రజలకష్టములను గుర్తించి, వెంటనే యీ గ్రామంలో ఒక బ్రాంచి పోస్టాఫీసును ఏర్పాటు చేయవలసినదిగా కోరుచున్నాను.

ఎస్. రామాచార్యులు, పెంగరగుంట.

### హిందీతోపాటు ప్రాంతీయ భాషల అభివృద్ధి

పాటియాలా, మార్చి 30: దేశంలో భాషా విషయక వివాదాలు త్వరలో అంతంకాగలవని సామరస్య, సమైక్యతతో కూడిన వాతావరణంలో జాతీయ భాషతోపాటు ప్రాంతీయ భాషలు, అభివృద్ధి చెందగలవనీ రైల్వేల మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి అన్నారు.

పెప్సూలోని పంజాబీ దర్బార్ వార్షిక సమావేశానికి అధ్యక్షత వహిస్తూ "యిలా అన్నారు. దేశ సమైక్యతకు జాతీయ భాష ప్రధానం భారత దేశంలో కొన్ని కోట్ల ప్రజలు యీ సంగతిని గుర్తించిన వారు లేరు. హిందీని ప్రచారం చేయడానికి ప్రాంతీయ భాషలను అభివృద్ధి పరచడానికి కూడా తగినంత ప్రోత్సాహం ఇవ్వాలి."

# వాల్మీకి రామాయణం

శ్రీ శ్రీనివాస శిరోమణి

## ౫౭

అకంపనుణ్ణి హనుమంతుడు చంపి వేసినాడు అనే వర్తమానము రావణాసురుడు విన్నాడు. ఆ రాక్షసేశ్వరుడిముఖము అప్పుడు చిన్నబోయింది. మంత్రుల వంక చూచినాడు. ఒక ముహూర్తముసేపు మనసులో ఆలోచించినాడు. అంతట ఆ మంత్రులు అందరితోనూ సంప్రదించినాడు. అప్పటికి ఇంకా మధ్యాహ్నము కాలేదు. ఆ పూర్వాహ్ణములోనే లంకాపట్టణము అంతా తిరిగి చూడటానికి బయలుదేరినాడు. ఆ లంకా పట్టణాన్ని కాపాడుతూ ఉన్న రాక్షససమూహాలనూ వ్యూహాలుగా ఉన్న సేనాసమూహాలనూ పతాకాలు ఎగురుతూ ఉన్న ధ్వజాల పంక్తులనూ చూచినాడు. వానరులు అట్లా తన లంకా పట్టణాన్ని ముట్టడించినందుకు కుపితుడు అయిపోయినాడు.

అంతట రావణాసురుడు తన సభాభవనానికి పోయినాడు. యుద్ధకోవిదుడు అయిన ప్రహస్తుణ్ణి చూచి "ఓ ప్రహస్తుడా, నీవు యుద్ధవిశారదుడవు. శత్రువులు హఠాత్తుగా మన పట్టణాన్ని ముట్టడించి బాధ పెట్టుతున్నారు. నీవు తప్ప మరి ఇతరులు ఎవరూ పోరాడి ఈ లంకాపట్టణాన్ని ఈ ముట్టడిలోనుంచి తప్పించలేరు అని నాకు తోస్తున్నది. నేనో కుంభకర్ణుడో నా సేనాపతివి నీవో ఇంద్రజిత్తో నికుంభుడో తప్ప మరి ఒకడు ఎవడూ ఈ భారము వహించలేరు. నీవు ఇప్పుడే నీ సైన్యాన్ని వెంటపెట్టుకొని వానరులు ఉన్న చోటికిపోయి వారిని జయించు. నీవు నీ సైన్యంతో వెళ్ళితే చాలు. రాక్షసవీరుల సింహనాదాలకు ఆ వానరవాహిని అంతా చలించిపోతుంది. వానర సైనికులు అందరూ పారిపోతారు. వాండ్లు చలచిత్తులు. యుద్ధశిక్ష పొందిన వాండ్లు కారు. నీ సింహనాదము వినగానే సింహగర్జనము విన్న ఏనుగులవలె చిత్తస్థైర్యము చెడి వాండ్లు పరుగులెత్తి పారిపోతారు.

"ఓ ప్రహస్తుడా, అట్లా వానర సైన్యము పారిపోయిన తరువాత రామలక్ష్మణులు ఆధారము లేని వాండూ అసహాయులూ అయి పోతారు. నీ చేతికి చిక్కుతారు. మనము ఊహిస్తున్నట్టు జరిగినా జరుగక పోయినా ఇప్పుడు మనము యుద్ధము చేయకుండా ఉండటానికి వీలు లేదు. యుద్ధములో ఎవరు జయిస్తారో చెప్ప లేము. అట్లా అనుకొని మనము యుద్ధము చేయకుండా ఊరక ఉండేట్లయితే ఇప్పుడు మన మీదికి ఎత్తి వచ్చిన ఎదిరి మనలను చంపి వేయకుండా పోదు. ఒక వేళ యుద్ధములో మనమే జయిస్తామో ఏమో చెప్ప లేము. కాబట్టి ఏమి అయినప్పటికిన్నీ మనము ఇప్పుడు యుద్ధము చేయడమే మనకు మేలు అని, నాకు తోస్తా ఉంది. ఓ ప్రహస్తుడా, నీకు ఏమి తోస్తున్నదో చెప్పు. నేను చెప్పింది నీకు అనుకూలముగా తోచినా ప్రతికూలముగా తోచినా మనకు మేలు అయ్యేది ఏమిటో ఆలోచించి చెప్పు" అన్నాడు.

ఈ విధముగా రాక్షసరాజు రావణాసురుడు చెప్పి అడిగింది విని అసుర రాజులో శుక్రాచార్యుడి వలె "ఓ రాజా, ఇదివరకు మంత్రులు అందరితోనూ ఆలోచించిన విషయమే ఇది. ఈ విషయములో పరస్పరమూ చర్చించడమూ వివాదపడడమూ అయి పోయింది. సీతాదేవిని ఇచ్చి వేసేటట్లయితే యుద్ధము ఉండదు అనీ ఇవ్వక పోయేట్లయితే యుద్ధము తప్పదు అనీ ఇదివరకే నిశ్చయము అయి పోయింది. మేము మంత్రులము యుద్ధము రాక తప్పదు అనుకొన్నదే.

"రాజా, నీవు ఎప్పుడూ నన్ను గౌరవిస్తూ ఉన్నావు. నానావిధాలా నన్ను సంతోష పెట్టుతూ ఉన్నావు. ఇప్పుడు సమయము వచ్చినది. నిన్ను సంతోషపెట్టడానికి నేను ఏ పని అయినా చేస్తాను. నీ కోసము నా బిడ్డలను అయినా నా పెండ్లాన్ని అయినా వదులుకొంటాను. నీ కోసము యుద్ధములో నా ప్రాణాలు పోయేటంతవరకూ పోరాడుతాను. నీవు చూస్తావు" అని చెప్పినాడు.

రావణాసురుడితో ఇట్లా చెప్పి ఆ ప్రహస్తుడు ఎట్టఎదుట ఉన్న సేనాధ్యక్షులను చూచి "ఓ సేనాధ్యక్షులారా, రాక్షస మహాసైన్యాన్ని ఇప్పుడే సిద్ధము చేయండి. పిడుగులవంటి నా బాణాలకు యుద్ధభూమిలో చచ్చి పడిపోయే వానరుల మాంసాన్ని పక్షులు తనివితీర తినవలెను" అని చెప్పినాడు.

ప్రహస్తుడు ఆజ్ఞాపించినట్టుగా ఆ సేనాధ్యక్షులు అప్పటికి అప్పుడు రాక్షస సైన్యాన్ని యుద్ధసన్నద్ధము చేసినారు. నానావిధ తీక్ష్ణాయుధాలూ ధరించిన మనిషి పిడుగులవంటి రాక్షసయోధులతో క్షణకాలములో లంకాపట్టణము అంతా నిండిపోయింది. ఆ యుద్ధములో జయించడానికి రాక్షసవీరులు అప్పుడు హోమాలు చేసి బ్రాహ్మణులకు గంధపుష్పాదులు ఇచ్చి పూజించడము వల్ల అక్కడ ఆజ్యసుగంధముతోనూ, పుష్పసుగంధముతోనూ గాలి వీచింది. విజయము కోసము మంత్రపూతముచేసిన వివిధవిధాల పూలదండలను సంగ్రామసన్నద్ధులు అయిన రాక్షసయోధులు అప్పుడు వేసుకొన్నారు. కవచాలు తొడుక్కొని చేతులలో ధనుస్సులు తీసుకొని రాక్షసయోధులు రావణాసురుడి దగ్గరకుపోయి నమస్కారము చేసి ప్రహస్తుడి దగ్గరకువచ్చి నిలిచినారు.

అప్పుడు ప్రహస్తుడు రావణాసురుడికి వీడ్కోలు చెప్పినాడు. మహాభయంకరముగా భేరిని కొట్టించినాడు. అప్పుడు మేఘ గర్జనల వంటి ధ్వనులు చేస్తూ సూర్యుడి వలె దుర్నిరీక్షముగానూ చంద్రుడి వలె మనోజ్ఞముగానూ బంగారు కిటికీలతో చక్కని పైకప్పుతో దుర్ధర్షము అయిన సర్పధ్వజముతో చక్కని చక్రాలతో మహావేగముతో పోయే గుర్రాలతో యుద్ధానికి సిద్ధము చేసిన రథాన్ని మంచి సమర్థుడు అయిన సారథి తోలుకొని వచ్చినాడు. ఆ రథము సమస్త జగత్తునూ పరిహసిస్తూ ఉన్నట్టు కనిపించింది. రావణాసురుడి ఆజ్ఞను శిరసావహించిన ప్రహస్తుడు ఆ రథము ఎక్కినాడు. రాక్షసమహాసైన్యము అప్పుడు ఆ రథము వెంట బయలుదేరింది.

అప్పుడు ఉరుముల వలె దుందుభులూ నానావిధవాద్యాలూ మోగినవి. శంఖాలు పూరించినారు. సముద్రము పొంగి భూమిని ముంచి వేస్తూ ఉన్నట్టూ దిశలు బద్దలు అయిపోతున్నట్టూ ఆ ధ్వనులు వినిపించినవి. ఆ ప్రహస్తుడి రథము ముందు నడుస్తూ ఉన్న రాక్షసయోధులు అందరూ భయంకరాకారులు. వాండ్లు అందరూ మహాకాయులు. భయంకరస్వరములో సింహనాదాలు చేస్తూ నడిచినారు.

అట్లా యుద్ధానికి పోతున్న ప్రహస్తుణ్ణి నరాంతకుడూ కుంభహనుడూ మహానాదుడూ సమున్నతుడూ అనే అతని నలుగురు మంత్రులూ వెంబడించినారు. ఆ రాక్షస మహాసైన్యము వ్యూహాలు తీరి ఏనుగుల మందలవలె ఆ ప్రహస్తుడు చుట్టూ నడచినవి. ప్రళయకాలములో సమస్తలోకాలనూ నాశనము చేసే యముడివలె ప్రహస్తుడున్నూ, సముద్రము పొంగి మహాప్రవాహాలై పొర్లుతూ ఉన్నట్లు ఆ రాక్షససైన్య సమూహాలున్నూ కనిపించినవి.

ఆ ప్రహస్తుడున్నూ అతడివెంట యుద్ధానికి పోతూవున్న రాక్షసయోధులున్నూ చేసిన సింహనాదాలకు లంకాపట్టణములో ఉన్న సమస్త జంతువులున్నూ భయపడిపోయి వికృతస్వరాలతో విపరీతముగా అరిచినవి. నెత్తురు తాగి మాంసము తినే భయంకరము అయిన పక్షులు అప్పుడు ఆకాశములో ఆ రథము పైన మండలాకారముగా ప్రదక్షిణము చేసినవి. భయంకరము అయిన నక్కలు అగ్నిజ్వాలలు కక్కుతూ అరిచినవి. అంతరిక్షమునుంచి కొరువులు కింద పడ్డవి. గాలి ఎడా పెడా కొట్టింది. గ్రహయుద్ధము ఆరంభము అయినందువల్ల గ్రహాల కాంతులు మాసిపోయినవి. మేఘాలు కర్కశఘోరముగా గర్జించినవి. ఆ ప్రహస్తుడి ముందు నడుస్తూవున్న రాక్షసయోధులు అందరూ తడిసిపోయేట్టు నెత్తురువాన కురిసింది. ఆ ప్రహస్తుడి రథపతాకము మీద ఒక గ్రద్ద వాలి రెండు రెక్కలను ముక్కుతో పొడుచుకొనసాగింది.

ఆ ప్రహస్తుడి రథము తోలుతూవున్న సారథి తండ్రి తాతలనుంచీ రథచోదక వృత్తిలో జీవించిన సూతవంశములో పుట్టినాడు. ఆ నేర్పరి యుద్ధాలలో ప్రహస్తుడికి రథము తోలినాడు. అటువంటి ఆ రథసారథి చేతిలోనుంచి హఠాత్తుగా కొరడా జారి నేలమీద పడిపోయింది. ఆ రథానికి కట్టిన గుర్రాల కాళ్ళు కారణములేకుండా మిట్టపల్లాలు లేని సమప్రదేశములో జారిపడి పోయినవి. అప్పుడు ఎదుర్కొనలేని దుర్ధర్షము అయిన కాంతితో యుద్ధానికి బయలుదేరిన ప్రహస్తుడి దేహకాంతులు ముహూర్తమాత్రములో కనపడకుండా పోయినవి.

ప్రసిద్ధికెక్కిన ఆ బలవంతుడున్నూ ఆ పౌరుషవంతుడున్నూ పోరాటానికి రావడము కపిసైన్యము చూచింది. నానాప్రహరణాలతోనూ ఎదురుగుండా నిలిచింది. ఆ వానరయోధులు యుద్ధము చేయడానికి పెద్ద పెద్ద చెట్లనూ పెద్ద పెద్ద రాళ్లనూ పెల్లగిస్తూ ఉంటే మహాధ్వని దొమ్మిగా అయింది.

అప్పుడు అటు రాక్షసులు అరుస్తూనూ ఇటు వానరులు గర్జిస్తూనూ ఉభయ సైన్యాలూ సంతోషముతో యుద్ధానికి తలపడినవి. ఉభయులూ వేగవంతులు. ఉభయులూ యుద్ధసమర్థులు. ఒకరినొకరు ఒకరొకరిని చంపడానికి వానరులూ రాక్షసులూ పిలుచుకొంటూ భూమ్యాకాశాలు బద్దలు అయిపోయేట్లు సింహనాదాలు చేసినారు.

అప్పుడు ఆ దుర్మతి ప్రహస్తుడు కపిరాజు సైన్యాన్ని తాను జయించగలను అనుకొని అగ్నిహోత్రము మీదికి అమితవేగముతో పోయే మిడుతవలె చావడానికి ఆ వానరసైన్యము మీదికి పోయినాడు.

## ౫౮

అట్లా వస్తూ ఉన్న ఆ భీమపరాక్రముణ్ణి రాముడు చూచినాడు. ఆ అరిందముడు నవ్వుతూ ప్రక్కన ఉన్న విభీషణుణ్ణి చూచి "ఓ విభీషణుడా, ఈ వస్తూ ఉన్న మహాకాయుడు ఎవడు. చుట్టూ గొప్ప సైన్యముతో వస్తూ ఉన్న ఈ నిశాచరుడు ఎవడో చెప్పు" అని అడిగినాడు.

"రామా, ఈ రాక్షసుడు రావణాసురుడి సేనానాయకుడు. వీడి పేరు ప్రహస్తుడు. రావణాసురుడికి లంకాపట్టణములో ఉన్న మహాసైన్యములో మూడవ భాగము వీడి స్వాధీనములో ఉంటూ ఉంది. వీడు ప్రసిద్ధికెక్కిన పరాక్రమవంతుడు. బలవంతుడు. శూరుడు. అస్త్రవేత్త" అని విభీషణుడు చెప్పినాడు.

సింహనాదాలు చేస్తూ ఉన్న రాక్షసయోధులను వెంటపెట్టుకొని వస్తూ ఉన్న ఆ భయంకరాకారుణ్ణి ఆ భయంకర పరాక్రముణ్ణి ఆ మహాకాయుణ్ణి ప్రహస్తుణ్ణి వానరవీరులు అందరూ చూచినారు. అప్పుడు ఆ బలవంతులు అందరూ అమితవేగములో ఆ ప్రహస్తుడికి ఎదురుగుండా పోయి సింహనాదాలు చేసినారు.

తళతళలాడుతూ ఉన్న ఖడ్గాలతోనూ శక్త్యాయుధాలతోనూ ఋష్టులు అనే ఆయుధాలతోనూ ముసలాయుధాలతోనూ శూలాలూ గదలూ ఇనుప సుదియలూ ఈటెలూ మొదలు అయిన వాటితోనూ రకరకాల గండ్రగొడ్డళ్లతోనూ విచిత్రము అయిన ధనుస్సులతోనూ బాణాలతోనూ ఆ రాక్షసయోధులు అందరూ జయము కాంక్షిస్తూ వానరులమీదికి పరుగెత్తుకొని వచ్చినారు. ఆ రాక్షసయోధులతో పోరాడటానికి పూలుపూసిన చెట్లు చేతుల పట్టుకొనీ పెద్ద పెద్ద పొడుగాటి వెడల్పాటి రాళ్లు పట్టుకొనీ వానరయోధులు నిలుచున్నారు. అప్పుడు రాక్షసులు వానరులమీద బాణవర్షము కురిపించినారు. వానరులు రాక్షసులమీద రాళ్ల వాన కురిపించినారు. ఆ విధముగా ఆ మహాసంగ్రామము ఆరంభము అయింది

ఆ యుద్ధములో రాక్షసులను అనేకమందిని వానరులు చంపి వేసినారు. వానరులను అనేకమందిని రాక్షసులు చంపివేసినారు. రాక్షసయోధులు శూలాలతో వానరులను చీల్చివేసినారు. చక్రాయుధాలతో వానరులను తెగవేసినారు. ఇనుప సుదియలతో వానరులను చితుక కొట్టినారు. గండ్రగొడ్డళ్లతో వానరులను నరికివేసినారు. బాణాలతో వానరుల గుండెకాయలను పగుల కొట్టినారు. తుండ్లు తుండ్లుగా ఎగిరిపడేట్టు వానరులను ఖడ్గాలతో తెగకొట్టినారు.

అప్పుడు వానరులు ఈ భూమిమీద కనిపించిన చెట్లనూ పర్వతాలనూ పెళ్ళగించి తెచ్చి వాటితో రాక్షసులను నుగ్గు నుగ్గు చేసినారు. ఆ వానరులు కొంతమంది రాక్షసులను వజ్రాయుధాలవంటి తమ గోళ్ళతో చీల్చివేసినారు. పిడికిలి పోట్లతో కొంతమంది రాక్షసులను చంపివేసినారు. చేతులతో కొంతమంది రాక్షసుల పళ్లు ఊడ కొట్టి వాండ్ల కన్నులు పెరికి వేసినారు. నెత్తురు కక్కుకొని నేల మీద పడిపోయేటు కొంతమంది రాక్షసులను కొట్టినారు. ఆ పోరాటములో అటు రాక్షసులూ ఇటు వానరులూ దెబ్బలు తిన్న వాండ్లు ఏడుస్తూనూ మూలుగుతూనూ ఉంటే తక్కిన వాండ్లు దొమ్మిగా సింహనాదాలు చేసినారు. ఉభయపక్షాల యోధులూ క్రుద్ధులు అయిపోయి వీరమార్గము అనుసరించినారు. కన్నులు తిప్పుతూ నిర్భయముగా క్రూరకృత్యాలు చేసినారు.

అప్పుడు నరాంతకుడూ నికుంభుడూ మహానాదుడూ సమున్నతుడూ చెలరేగి వానరులను ఘోరముగా వధించడము మొదలు పెట్టినారు. వాండ్లు అట్లా చటుక్కున వచ్చి పడి వానరులను చంపి వేస్తూ ఉంటే ద్వివిదుడు ఒక పర్వతశిఖరాన్ని నరాంతకుడి మీద రువ్వినాడు. ఆ దెబ్బకు నరాంతకుడు చచ్చి పోయినాడు. చక చకా చేతులతో పనులు చేసే దుర్ముఖుడు అనే వానరుడు ఒక మహావృక్షాన్ని ఇట్టే పెళ్లగించి దానితో సమున్నతుణ్ణి కొట్టి చంపి వేసినాడు. తేజోవంతుడు జాంబవంతుడు అప్పుడు పరమక్రుద్ధుడు అయిపోయి ఒక పెద్ద రాతి బండను మహానాదుడి వక్షఃస్థలముమీద వేసి కొట్టినాడు. ఆ రాతి దెబ్బకు ఆ మహానాదుడు చచ్చి పోయినాడు. తారుడు ఒక చెట్టుతో కుంభహనుడి శిరము మీద కొట్టినాడు. ఆ చెట్టు దెబ్బకు కుంభహనుడు చచ్చి పోయినాడు. అట్లా తన నలుగురు మంత్రులనూ వానర యూధపతులు చంపి వేయడము ప్రహస్తుడు రథము మీది నుంచి చూచినాడు. సహించలేక పోయినాడు. ధనుస్సు తీసుకొని వానరులతో ఘోరముగా పోరాటము సాగించినాడు. ప్రళయకాలము ఆసన్నము అయినట్టు ఉభయ సైన్యాలూ కలవర పడిపోయినవి. సముద్రము పొంగి పొర్లి ఈ భూమిని అలలా ముంచి వేస్తున్నట్టు ఉభయ సైన్యాలూ మహాధ్వనులు చేసినవి.

అప్పుడు ఆ మహాయుద్ధములో యుద్ధకోవిదుడు ప్రహస్తుడు కుపితుడు అయి బాణపరంపరలతో వానరులను భయంకరముగా నొప్పించినాడు. ఆ యుద్ధభూమిలో పడిపోయిన వానరుల కళేబరాలూ రాక్షసుల కళేబరాలూ పర్వతాల వలె ఘోరముగా కనిపించినవి. నెత్తురులో నిండిపోయిన ఆ యుద్ధభూమి అప్పుడు వైశాఖమాసములో విరగపూసిన మోదుగుచెట్లతో కమ్ముకొని పోయిన భూమివలె తోచింది. చచ్చిపడిపోయిన వీరసమూహాలు తీరాలుగానూ విరిగిపడిపోయిన ఆయుధాలు మహావృక్షాలుగానూ రక్తప్రవాహము మహాజలముగానూ గుండెకాయలు ఇరుపైపులా ఉండే మాంసము బురదగానూ వెదచల్లినట్టు పడి ఉన్న పేగులు నాచుగానూ ఛిన్నాభిన్నము అయిపోయిన దేహాలూ తలకాయలూ చేపలుగానూ దేహావయవాలు పచ్చికపట్లుగానూ అంతటా వ్యాపించిన గద్దలు హంసలుగానూ రాబందుపక్షులు సారసపక్షులుగానూ మెదడు అక్కడ వ్యాపించిన నురుగుగానూ ఆర్తులు అయిపోయిన వారిమూలుగులూ మహాధ్వనులుగానూ పిరికివాళ్లకు దాటిపోవలనుకొండా యముడు అనే మహాసముద్రములోకి పోతున్న మహాప్రవాహమువలె ఆ యుద్ధభూమి అప్పుడు అక్కడ కనిపించింది. శరత్కాలములో హంసలూ సారసపక్షులూ సేవించే నదిని సులభముగా దాటపోయేట్టు యుద్ధభూమి అనే దాటిపోవలనికాని ఆ నదిని రాక్షసులూ వానరులూ ఇట్టే దాటిపోయినారు. కమలాల పుప్పొడులతో నిండిఉన్న కాసారములో దిగి బయటికివచ్చిన ఏనుగుల దేహాలు ఎర్రపడిపోయినట్టు ఆ యుద్ధభూమిలోకి పోయిన వానరుల దేహాలూ రాక్షసుల దేహాలు ఎర్రపడిపోయినవి.

రథము మీదినుంచి బాణవర్షము కురిపించి వానరులను ఇట్టే చంపివేస్తున్న ప్రహస్తుణ్ణి నీలుడు చూచినాడు. అమిత వేగముతో ఆ వానర వీరుడు ఆ రాక్షస వీరుడికి ఎదురుగుండా పోయినాడు. అట్లా తనమీదికి వస్తూవున్న ఆ వానరవీరుణ్ణి నీలుణ్ణి ఆ రాక్షసవీరుడు ప్రహస్తుడు చూచినాడు. మహానీలమేఘాన్ని ఎగరకొట్టే వాయువు వలె ఆ నీలుడికి ఎదురుగుండా ప్రహస్తుడు ఆదిత్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్న తన రథముమీద పోయినాడు. ఆ మేటి విలుకాడు రాక్షససేనాపతి ఆ ప్రహస్తుడు అంతట తన ఉత్తమోత్తమము అయిన ధనుస్సును ఆకర్ణాంతము లాగి నీలుడిమీద బాణాలు వదిలినాడు. ఆ బాణాలు అమిత వేగములో గురితప్పకుండా కుపితసర్పాల వలె పోయి నీలుడిమీద పడ్డవి. అవి అతనిని నొప్పించి భూమిలోకి పోయినవి. అగ్నిహోత్రము వంటి తీక్ష్ణబాణాలు తనమీద ప్రహస్తుడు వర్షముగా కురిపిస్తూవుంటే ఆ మహాబలవంతుడు నీలుడు శరత్కాలములో కురిసి ఇట్టే వెలిసిపోయే వరధారలను ఓర్చుకొనే ఆబోతువలె నిలుచుండి పోయినాడు. అయితే ఆ బాణవర్షానికి పట్టరాని కోపము వచ్చింది. సమయము దొరికింది. మహాసాలవృక్షాన్ని ఒకదాన్ని ఇట్టే పెళ్ళగించినాడు. మనోజవముతో పోయే ప్రహస్తుడి గుర్రాలను ఆ చెట్టుతో కొట్టినాడు. ఆ దెబ్బకు ఆ గుర్రాలు చచ్చి పడిపోయినవి. అప్పుడు ఆ మహాబలవంతుడు నీలుడు చటుక్కున ఎగిరిపోయి ప్రహస్తుడి చేతిలోవున్న ధనుస్సును పట్టుకొని ముక్కలు ముక్కలుగా విరగ కొట్టినాడు. అంతట పదే పదే సింహనాదము చేసినాడు.

రాక్షస సేనానాయకుడు ప్రహస్తుడు అట్లా విధనుష్కుడూ విరథుడూ అయి పోయినాడు. అంతట భయంకరము అయిన ముసలాయుధము తీసుకొని ఆ రథము మీదినుంచి కిందికి దూకినాడు. అంతట అమిత వేగములో ప్రహస్తుడు నీలుడి నొసటను ఆ ముసలాయుధముతో కొట్టినాడు. దేహము అంతా నెత్తురులో తడిసిపోయి నీలుడు క్రుద్ధుడు అయిపోయి ఒక మహావృక్షముతో ప్రహస్తుడి ఎదురు రొమ్ముమీద కొట్టినాడు.

అప్పుడు ఆ ఉభయ సేనానాయకుల దేహాలూ నెత్తురులో తడిసిపోయినవి. ఉభయులూ బలవంతులు. అమిత వేగవంతులు. దెబ్బలుతిన్న మదపుటేనుగులవలె ఉభయులూ పోరాడటానికి బద్ధసంకల్పములో నిలుచున్నారు. ఆ వీరులు ఉభయులూ పోరాటములోనెన్నడూ వెనుకడుగు పెట్టి ఎరుగరు. ఉభయులూ సింహశావాలవంటి వాండ్లు. అనేక యుద్ధాలలో ఉభయులూ సింహమువంటి దర్పముతోనూ పెద్దపులివంటి పరాక్రమముతోనూ పోరాడి జయించినారు. ఎన్నడూ అపజయము అనేది ఎరుగరు. అటువంటి ఆ రాక్షససేనానాయకుడు ప్రహస్తుడూ వానరసేనానాయకుడు నీలుడూ జయేచ్ఛతో పరస్పరమూ సుతీక్ష్ణము అయిన కోరలతో కొరుక్కున్నారు.

అంతట ప్రహస్తుడు ముసలాయుధము తీసుకొని నీలుడి మీదికి ఉగ్రవేగముతో పరుగెత్తినాడు. అప్పుడు ఆ మహావేగుడు నీలుడు ఒక పెద్దరాయి తీసుకొన్నాడు. ప్రహస్తుడు తనతో పోరాటానికి ముసలాయుధము ఎత్తేలోపలనే ఆ పెద్ద రాతిబండను ఎత్తి అతడి తలమీద పడేట్టు విసరి వేసినాడు. భయంకరము అయిన ఆ రాతిబండ ప్రహస్తుడి తలమీద పడ్డది. ఆ తల ముక్కలు ముక్కలు అయిపోయింది. వేరుతెగిన మహావృక్షము వలె ప్రహస్తుడు గిటా లున నేల కూలినాడు. పగిలిపోయిన శిరము నుంచీ దేహము నుంచీ పర్వతము నుంచి సెలయేరువలె రక్తము ఏరులై పారింది.

అంతవరకూ అకంపముగా వున్న రాక్షససైన్యము కంపించిపోయింది. తమ సేనానాయకుడు ప్రహస్తుడు అట్లా అయిపోగానే రాక్షసయోధులు అక్కడ నిలువలేకపోయినారు. అనకట్టను దాటి జలాలు ముందుకు పోలేనట్టు రాక్షసయోధులు ఒక్క అడుగు ముందుకు వేయలేకపోయినారు. లంకాపట్టణములో రావణాసురుడి ఇంటికి పరుగెత్తిపోయినారు. ఆలోచించుకొంటూ మాటాడలేక మూగవాండ్లవలె నిలుచుండిపోయినారు. దుఃఖమహాసముద్రములో పడి తెప్పరిల్లలేక పోయినారు.

అట్లా ప్రహస్తుణ్ణి జయించిన ఆ వానరసేనానాయకుడు ఆ మహాబలవంతుడు నీలుడు రామలక్ష్మణుల దగ్గరకు పోయినాడు. వారి మన్ననలను అందుకొన్నాడు.

---

జిజ్ఞాస:

# సౌదర్యం

[అంబటిపూడి వెంకటరత్నం]

సోదరుడు, భ్రాత- అనే రెండుశబ్దాలున్నాయి. భ్రాతృశబ్దంనుంచే బ్రదర్ అనే ఆంగ్లశబ్దం పుట్టింది. రెండూ సమానార్థకాలుగానే లోకంలో వాడుక ఉంది. అయినా భ్రాతృశబ్దానికి 'భాజ్' అనే ధాతువు మూలం. దగ్గిరబంధువు అనే అర్థం వస్తుంది. సోదరశబ్దం 'సమానం ఉదరం యస్య సమానస్య' అనే సమాసంవల్ల ఒక ఉదరంనుండి వచ్చినవారు అనే అర్థాన్ని ఇస్తుంది. కాబట్టి బ్రదర్ అంటే సోదరుడు అవును కాని ఇంకా ఎక్కువ. తను వచ్చిన గర్భంనుండి వచ్చినవాడేగా తన సద్గుణాలు ఉంటై. రక్తంలో గుణాల్లో సమానత్వం ఉండడానికి వీలుఉంది. తనకూ తన సోదరుడికీ భేదంలేదు కనక ఆత్మీయత రాణిస్తుంది. పెద్ద, చిన్న, అనే భేదం తప్ప ఏమీ వ్యత్యాసం లేదు. 'ఆత్మావై పుత్రనామాసి' 'పితృసమో జ్యేష్ఠః' ఇత్యాదిసూక్తులవల్ల తండ్రియే కుమారుడుగా పుట్టుతున్నాడనీ, పెద్దవాడు తండ్రితో సమానుడనీ వాడుక. తల్లివలె వదినెను గౌరవించడంలో పై అర్థం సార్థకమౌతుంది. తమ్ముడు అన్నయందు భక్తి వహించడంలో కూడా పై సూక్తే మూలం. ఇట్లా అన్నదమ్ముల్లో ఏర్పడ్డ అభేదభావం సౌదర్యం.

మూర్ఛపడిఉన్న లక్ష్మణుని చూచి రాముడంటున్నాడు.

'దేశే దేశే కళత్రాణి
దేశే దేశేచ బాంధవాః
తంతుదేశం నపశ్యామి
యత్ర భ్రాతా సహోదరః'

[ఏ దేశంలోనైనా భార్యలు దొరుకుతారు. అనూలకంగా బంధువులు ఏర్పడతారు. కాని తోడబుట్టినవానితో సమానమైన ఆప్తబంధువు దొరికే దేశం నాకు కనబడలేదు.]

ఇక్కడ సహోదరుడైన భ్రాత దొరకడంటున్నాడు. భ్రాతృ శబ్దానికి సామాన్యార్థం, సహోదర శబ్దానికి విశేషార్థం. సతియందు రామునకు ప్రేమ ఉన్నది. రావణుడు ఆమెను అపహరించాడని తెలిసి సైన్యం పోగుచేసి వారధి బంధించి యుద్ధం చేస్తున్నాడు. కాని, అయోధ్యను వీడి తన వెంట వచ్చి బ్రహ్మచర్యం జరుపుతూ సేవ చేసి సంగవర్జితుడై మహానిగ్రహమూర్తి అయిన ఆ తమ్ముణ్ణి సామాన్యంగా చూచేటప్పుడు అతని విషయం గమనించలేదు. అతడు మూర్ఛితుడై పడి ఉన్నాడు. రాముడు చూచాడు. సోదరుడైన లక్ష్మణుని యొక్క యథార్థ స్వరూపం, తత్త్వం ప్రత్యక్షమైంది. ఆ భావాన్ని సందర్శించిన రాముడు అన్నటువంటి పై వాక్యం లోని ఆత్మను గమనించండి. ఒక భార్య చస్తేనో ఆమె తనకు ఇష్టం కాకపోతేనో ఇంకో పెళ్ళామును కట్టుకోవటం, ఆ మూలంగా మళ్లీ అత్తమామలూ, బావమరదులూ, మరదళ్ళూ అందరూ ఏర్పడుతున్నారు. కాబట్టి భార్యా బంధువులు ఎప్పుడుబడితే అప్పుడు ఎక్కడబడితే అక్కడ దొరుకుతారు. అట్టి భార్యకోసం తాను యుద్ధసన్నద్ధుడై నిలచి ఉన్నాడు.

ఇక సోదరుడో! తనతోడబుట్టినవాడు గతిస్తే మళ్ళీ ఎక్కడైనా స్నేహితుడో బంధువో దొరుకుతాడు గాని, సోదరుడు దొరుకుతాడా? ఈ సోదరుని మూల్యం ఎంత? తను పోతే ఎంతో తన సోదరుడు పోతే అంత. ఇద్దరికీ అటువంటిది సంబంధం. 'భ్రాతా మాతా దక్షిణబాహు ఖండం' అంటారు. కాని, బాహువునాకు ప్రాణమనే నా ఊహ. రక్తసిక్తాంగుడై పడి ఉన్న తమ్ముణ్ణి చూస్తూ ఏడుస్తున్నాడు రాముడు.

'కిం ను మే సీతయా కార్యం
కిం కార్యం జీవితేన వా
..................
శక్యా సీతా సమానారీ మర్త్య
లోకే విచిన్వతా
న లక్ష్మణ సమో భ్రాతా...
పరిత్యక్ష్యా మ్యహం
ప్రాణం వానరాణాం తుపశ్యతాం
యది పంచత్వ మాపన్నః సుమిత్రా
నందవర్ధనః'

[ఇక (లక్ష్మణుడు లేకపోతే) నాకు సీత ఎందుకు? బ్రతుకు ఎందుకు? లోకములో కావాలంటే సీతవంటి భార్య దొరుకుతుంది. కాని లక్ష్మణుడి వంటి సోదరుడు దొరకడు. లక్ష్మణుడే గనక ప్రాణాలు విడిచేనా ఇంతమంది వానరవీరులు చూస్తుండగా నేనుకూడా చచ్చిపోతాను.]

అమ్మయ్యో, ఎటువంటివండీ యీ వాక్యాలు! లక్ష్మణుడు పోతే రాముడు బ్రతకడా? నిజంగా బ్రతకదలుచుకోలేదు. అంటే లక్ష్మణుడికి విలువ ఎంత? ఎంతమంది సీతలైనా లక్ష్మణుడితో సరితూగలేదు రాముడు తూస్తున్న త్రాసులో. సౌదర్యం అంటే అది. దీని విలువ అదృష్టం గలవాళ్లు అనుభవించి గ్రహిస్తారు.

నాకు ఒక తమ్ముడు. రాముడికి లక్ష్మణుడెట్లాగో నాకు నాతమ్ముడట్లా. నేనూ నా భార్యా నాతమ్ముడు మునుపటం చుండూరు వెళ్లడానికి పొందుగలవద్ద కృష్ణ దాటుతున్నాం. పడవలో ఉన్నాం. మా సంభాషణకు గానంగా అతడున్నాడు. గంగను సీతారామలక్ష్మణులు దాటుతున్న ఘట్టం స్ఫురించింది. లక్ష్మణుడికీ నా తమ్ముడికీ చాలా సామ్యం ఉందని నాలో నేను అనుకుంటాను. నేను చుండూరులో వుంటున్నాను. అతడు ఇంటివద్ద వృద్ధులైన తల్లిదండ్రులను కనిపెట్టుకుని ఉంటున్నాడు. స్కూల్ ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. ఎవరో పిల్లనిస్తామనివచ్చారు. పిల్ల మంచిది, సంబంధం మంచిది అన్నారంతా. కాని, 'మా అన్నవచ్చి ఆ మాట అంటేగాని నే నొప్పుకోను' అన్నాడు. వెంటనే నా వద్దకు చుండూరు వచ్చాడు. కొన్నాళ్లు నా దగ్గర ఉన్నాడు. నేను వ్రాసివుంచిన కావ్యాల వ్రాతప్రతులు తీసుకొని నా చేత చదివించి విన్నాడు. అక్కడి ఆహారం గిట్టలేదు. జ్వరం వచ్చింది. టైఫాయిడ్ అన్నారు. నాగుండె బదిసి పోతున్నయ్. డాక్టర్ ఫరవాలేదంటున్నాడు. చికిత్స జరుగుతున్నది. మనిషిని కదిలించి రెండువందల మైళ్లు తీసుకొచ్చే వీలు కాకుండా వుంది. అందరు ఆప్తజనం చుట్టూ ఉన్నారు. కాని, ఇద్దరు సోదరులం మేము. వాడికి నేను నాకు వాడు ఆత్మీయులం. నా భార్య మా తల్లిదండ్రులవద్ద ఉన్నది. పెద్దవాళ్లకు పుత్తరం వ్రాశామన్నా నుత్తరయమాతుం దితే వద్దన్నాడు. నేనింటికి తెలుపలేదు. మందిస్తున్నాడు. పండ్లరసం తెమ్మన్నాడు వైద్యుడు. నేను లోపలికి పోయి రసంతీసి గ్లాసులో పోసుకొని తెచ్చాను. తమ్ముణ్ణి క్రింద పడుకో బెట్టారు. నాచేతులో గ్లాసు క్రింద పడ్డది. తోట మల్లయ్య ఎదురుగా ఉన్నాడు కళ్లనీళ్లు పెట్టుకుంటూ. 'ఏం మల్లయ్యా! ఇట్లా చేశారా నా తమ్ముణ్ణి' అన్నాను. అతడు ఇంకా ఏడుస్తున్నాడు. వైద్యుడు అతని ప్రక్కనే కనబడ్డాడు. 'ఏమయ్యా! ఇంతేనా?' అన్నాను. అతడు ఏడ్పు మొదలు పెట్టాడు.

నాకు లోకం అంతా గిర్రున తిరిగి పోతున్నట్లయింది. దుఃఖం అంటే అర్థం ఇదివరకు నా శోకవిధంగా ఉండేది. కాని, ఇప్పుడు దాని విశ్వరూపం సన్నాదరించింది. నా చుట్టూ ఉన్న ప్రపంచకంలో నా శేం కనబడు తున్నదో! నాకు కర్తవ్యం ఏమీ తెలియడంలేదు. కాని చుండూరు ప్రజలూ, చుట్టూ ఉన్న గ్రామాలవాళ్లూ నా కాప్తులు; నా యింట్లో బంధువులవంటి వాళ్లు. వాళ్లందరూ నన్ను చూచి ఏడుస్తున్నారు. 'ఏడు సంవత్సరాలు దానధర్మాలతోనూ, ఆధ్యాత్మిక చింతలోనూ, సరస్వతీసేవలోనూ గడిపిన జీవితానికి ఇదా ఫలితం' అని మా 'ధవళ' ఏడుస్తున్నాడు. అన్నీ సిద్ధం చేశారు. వెయ్యిమంది చేరారు. అస్తమానం అయింది. మేళం మొదలయింది. దేశాచారంప్రకారం చేర్చి ఊరేగించి రాత్రి గొమ్మడింటికి శ్మశానంలో శవదహనం చేశారు. చితి అంటుకున్నది. జ్వాలలు లేచినవి. ఒకొక్క జ్వాల ఒక నాలుకగా ఇన్ని నాలుకల అగ్నిహోత్రుడు నన్ను ఎందుకు మ్రింగడో, నా శరీరం లో ఇంకా ఎందుకు ప్రాణం నిల్చిఉన్నదో, కొంత దూరాన కూర్చొని చూస్తున్నాను. కళ్ళ నీళ్ళు వస్తున్నవి. హృదయం చెక్కలయి చూర్ణమయిపోతున్నది. తల దిమ్మెక్కి ఉన్నది. ఏం చెయ్యాలో, ఇక నా జీవితానికి విలువ ఏమిటో నాకర్థం కాలేదు. మర్నాడు అస్థిసంచయనం చేయాలె. ఇంటివద్ద ఈవిషయం ఏమీ తెలియదు. నేను ఈ అస్థులు తీసుకొని ఇంటికి వెళ్లాలె. వెళ్ళి, 'అబ్బాయి ఏడిరా?' అంటె ఏం చెప్పేది? ఈ మాట మాపించేదీ? చూపిస్తే మా అమ్మ ఏమనుకుంటుంది? మా నాయన కోపదారి ఏమంటాడు? నేను ఏం చెయ్యడం మంచిది? చచ్చిపోనా? అవడమేకాని, చేతకాదంటూరు. ఇంకేం చెయ్యడం భావ్యం? ఇంటికి పోకుండా ఇంకెక్కడికన్నా వెళ్ళితే? ఇద్దరం కుమాళ్ళుండి, అందులో ఒకడు పోతే, ఇంకొకడు వాళ్లకు వృద్ధాప్యంలో సేవచేసి ఆధరువు కావడం విధి అనేది ఒకరు చెప్పాలవా? కానీ, ఒక్క విషయం మా అమ్మ అని ఏడవవచ్చు, 'కళ్లకన్నా చూపించకపోతివి గదిరా' అని. అందులో ఎంత వ్యంగార్థం ఉంటుంది.

శ్రీరాముడి మాటలు వినండి—

'కథం మంబాం సుమిత్రాంచ
పుత్రదర్శన లాలసాం
వివత్స్యాం వేపమానాంచ
క్రోశంతీం కురరీ మివ
కథ మాశ్వాసయిష్యామి యది
యాస్యామితం వినా వినా తేన
గతః పునః

ఉపాలంభం న శక్ష్యామి
సోఢుం బత సుమిత్రయా
ఇహైవ దేహం త్యక్ష్యామి
నహి జీవితు ముత్సహే॥'

(లక్ష్మణుడు లేకుండా నేనింటికి పోతే లక్ష్మణుని చూడాలని కోరే సుమిత్రకు సంగతి తెలుస్తుంది, దూడ పోయిన లేడివలె ఘోరంగా ఏడ్చే ఆ సుమిత్రను ఎట్లా ఓదార్చేది? సుమిత్ర అప్పుడనే మాటలను భరించగలనా? ఇక్కడే ప్రాణాలు విడుస్తాను. బ్రతకాలని నాకు ఉత్సాహం లేదు.)

అప్పటి రాముని అనుభవంలో ఇంకా ఒక ఆశారేఖ ఉన్నది. కాని, నాలో ఆ ఆశలేదు. కేవలం నిరాశ. అమ్మా నాయనా ఏమీ అంటారనే మాట అట్లా ఉంచుదాం. నా స్థితి ఏమిటి? వాడు బ్రతికిఉంటే నే నిట్లా ఉంటేవాడను కాను. వాడు పోవడం నా దౌర్భాగ్యం. ఆ చితి ఆ అగ్ని జ్వాలలు నాకు కనబడుతున్నయ్. ఆ రాత్రి కాళరాత్రి—

'ఈ దోషాతన మెంత భీకరమొ, నా
కే యిట్టులా, లేక నా
నాదేహవ్రజ మీ దురంతభయసం
తాపాబ్ధిలో జారి డ్డా
రా దిగ్దంబరుచున్నదే; ఇదియొ దు
ర్వారోజ్జ్వల ద్వహ్నియై
కాదన్న న కబళించు నె నిఖిలలో
కద్రోణి నొక్కుమ్మడిన్.

ఇది నా యందున నే విషాదగము, ఇం
తేనిన్ సర్వప్రాణిహో
నిదమైనట్టులు, లేదు! సర్వజగతీ
నిద్రా సుఖాభుక్తికా
స్పదిమై సవ్వడిలేక నన్నుగని జీ
వ్యాల్ సాచు, నీ యంద కొ
రదికల్ సాయముకావు, పినిరొద మ
ర్మం బేమి దాగున్నదో.

నా కాలోచనజెప్ప చుక్క ఒక్కటై
నన్ కానరాదేల? నీ
లాకాశంబున కాటుకల్ బులిమిరే?
హైన్యంబు కట్టా! ధరి
త్రీ కళ్యాణియు బందరైనది. అనా
దీయమ్ము లీ పంచభూ
తాకారమ్ములు ఒక్కటే కలుపు పో
లై పోవు శ్చే హేతువో.

ఏ సుఖసుప్తి నాకు లభి
యింపదొ దానికే వేచి వేచి వి
శ్వాసము కొల్ల బుచ్చితి; వి
భావరిలో విలయమ్మె సౌమ్య. 'నా
కై సగమిత్తువా?' అనెడి
ఆర్తవచస్సులు తోచునేడ? నీ
శ్వాస కవోష్ణ వాయువులు
బర్వ నిటే యిటు వత్తురవ్వరే.

కానేకాదు, పరప్రజాభణితమే
కాదే! దురంత వ్యథా
తూణీర మ్మొకటుండి దాని విడి నా
తో ఘోరుక్తె వచ్చి నా
లోనక్ నాటిన అంబకమ్ముల ప్రథా
లూనమ్ము నా డెందమే
నానారూపములై బహుస్వనములై
నమ్మించు నే నన్నిటుల్.

ఇంటికి వచ్చాను. మా అమ్మా నాయనా నన్నేమీ అనలేదు. కాని ఏ ప్రదేశం చూచినా ఏ వైపు చూచినా వెనక కనబడ్డట్టుగా కనబడడం లేదు.

ఇది నేజూచిన పూర్వదృశ్యములె, ఎ
న్నో శైశవక్రీడలన్
కువిదాలానవహోసభాసురుడనై
కోభిల్లలేనే, ఇటన్
ఉవిలే దిప్పుడు. లేదు మాసె, విలయ
జ్యాముక్త నారాచ ప్రో
రవిరావమ్ములుగా ప్రతిధ్వనులు శ
బ్దద్వంద్వము దాల్చునే!

అట్లాగే పదిహేనేళ్ళనుండి ఒకసారి అన్నా వాణ్ణి తలుచుకొని కన్నీరు పెట్టనిరోజు ఉండదు. ఆరని దుఃఖజ్వాల అంతస్సులో అట్లా మండుతూనే ఉంది. వాడు చదువుకున్న కథల పుస్తకం దొరికింది. ఆ కథలు పద్యాలుగా నీరాంజలి రచించాను. అంకితం అతడికే:—

హృదయ సమాధిలోన విదు
రించిన తమ్ముడ! లేవవోయి; నీ
రొదయను లేటి లేటి వరి
యించిన వీరసుమాలు జోసిటన్
పదిలము చేసి తెచ్చితి ప్ర
పాసయగున్ ఇక లెమ్ము నాయనా!
విదురను మేలుకో ఉసుమ
నిషమరందము నింతి గ్రోవరా!
చంద్రశాలప్రాకాను. దా డి కే
అంకితం :—

హృదయరహోగృహాన నవ
శించిన తమ్ముడ లేవవోయి! నీ
రొనయన లేత లేటి వరి
యించిన ప్రేమసుమమ్ములోని సౌ
హృద మకరందధార వచ
రించెను ఆత్మసమర్పణమ్ము కాం
చాదవని విశ్వసించితి ర
చించితి నీదు ప్రియాత్మతోడు గన్.

వనవాటి వ్రాశాను. అదీ తమ్ముడికే:
విడనుండియు నాతమ్ముడి దివ్యదేహంబు
నా బహిఃప్రాణమయ్యె నీనాడితండు
తే డిహమ్మున, వడలె నిలింపపురికి!
వాని స్మృతిచిహ్నములు
వనవాటి యొకటి.

అతడి పెట్టెల్లో అతడి పుస్తకాలలో అతడు వ్రాసిన అక్షరాలలో నాకతడి ముచ్చట్లు వినిపిస్తయ్; రూపం కనబడుతుంది. రాముడు 'పరిత్యక్ష్యా మ్యహం ప్రాణం' అన్నంత సోదరభావం నాలో లేకపోయిందా అని బాధపడడమే నా జీవితంలో మిగిలిఉంది. సౌదర్యం అనుకుందేటప్పటికి చుండూరు గుర్తుకు వస్తుంది నాకు:

నా కవితాకుమారి జనన
స్థల మయ్యది, నా ప్రవర్తన
శ్రీకి విహారభూమి యది,
చిత్రము! నాదు పవిత్రజీవితా
శా కిరణమ్ము రాలిన శ్మశాన
తల మ్మటనే, శుభాశుభ
వ్యాకృతి జాలుసీడల వ
యమ్ముల నేర్చిన దాపురమ్మొకో
అది పురాణుషి, సాహితీనదిని పుణ్య
పంచభూతాత్మకంబైన ప్రాంతి
మేమొ
ఆయువులర క్తిచే లేదు నాయువిత్వ
హేతువై కావ్యవీథి ప్రమోయించు
నేమొ

సౌదర్యంయొక్క ఒక విధం చూచాం పైన. ఇంకోవిధం పైదానికి పూర్తిగా విరుద్ధం. ఇద్దరుకుమాళ్లుంటే ఇద్దరూ తండ్రిఆస్తికి సమానభాగస్థులు. ఆభాగాలలో ఒకటి మెరుగు ఒకటి తరుగు కావడం సహజం. అట్టి వేళల జరిగే తగాదాలు క్రమంగా యుద్ధా

(8 వ పేజీ చూడుడు)

## కొవ్వూరుతాలూకా యన్. జి. ఓ. లు

కొవ్వూరు, మార్చి 28: తాలూకా యన్. జి. వో. సంఘ ప్రథమ వార్షికోత్సవం యీనెల 24, 25, తేదీలలో శ్రీ బి. వెంకటస్వామి అధ్యక్షతన జరిగింది. శ్రీ పి. వి. కృష్ణయ్య స్వాగతమిచ్చారు.

శ్రీ కె. వి రమణ, మాట్లాడుతూ జీతాలవిషయంలో కొన్ని రాష్ట్రాలలో వున్న "లాస్పింగ్ పద్ధతి" అమలుపరచాలని కోరారు.

అధ్యక్షులు మాట్లాడుతూ వుద్యోగుల యిబ్బందులు ప్రస్తావించారు. గత సంవత్సరం కర్నూలులో జరిగిన శాస్త్రి మహాసభల తీర్మానాలు వుదహరించారు. ఉద్యోగులు ఐకమత్యంతో మెలగాలని కోరారు. శ్రీయుతులు యం. వి. సుబ్బారావు, వై. వి. చలపతిరావు, కె. వి. యస్. అప్పారావు, ఎ. రామారావు, యం. వెంకట రామ సంతులు, యం. రామలింగశాస్త్రి ప్రసంగించారు.

నూతన అధ్యక్షులుగా శ్రీ యస్. వెంకట నారాయణ, ఉపాధ్యక్షులుగ శ్రీ బి. వెంకటస్వామి, కార్యదర్శిగ శ్రీ కె. రామారావు, సహాయ కార్యదర్శిగ శ్రీ యం. వి. సుబ్బారావు, మరి 8 మంది సభ్యులను ఎన్నుకున్నారు.

కేంద్ర వేతన సంఘ నిర్ణయాలను అమలు పరచాలనీ, యన్. జి. వో. ల. పిల్లలకు స్కూలు ఫైనల్ వరకు ఉచిత విద్యగరపాలని కోరారు. నవోదయ నాటకం ప్రదర్శించారు.



# గ్రామసీమలో వైద్య సహాయం
## —ఒక సూచన

### డా॥ సత్యవోలు సత్యనారాయణమూర్తి

ప్రతి గ్రామానికీ ఒక ఆసుపత్రిని నెలకొల్పాలనీ-తదనుగుణంగా అవసరం గ్రామానికి ఒక డాక్టరుండాలనీ చాలా కాలంనుంచి ప్రజలూ, ప్రభుత్వం కూడా అనుకుంటున్నారు.

కాని ఆ విధంగా యింతవరకు జరుగలేదు-ముందు ముందు కూడా అంత త్వరలో జరిగే సూచనకూడా కన్పించుట లేదు. కాని అటువంటి ఏర్పాటు జరగాలంటే వాటికుండే రెండేరెండు ప్రతిబంధకాలు తొలగిపోవాలి. (1) ధనలోపము (2) డాక్టర్ల కొఱత. ధనలోపము అనేది మనకు యింతిలో తీరుతుంది అనే నమ్మకము లేదు. డాక్టర్ల కొఱత అంటే-ప్రస్తుతం వున్న "క్వాకు డాక్టర్ల"యితే, ఒక్కొక్క గ్రామానికి పదేసిమంది యిప్పుడేవున్నారనుకోండి. అలాకాకుండా వైద్యవిద్యలో సక్రమశిక్షణపొంది అగ్రాలైన గాడ్యుయేట్సుగానీ లేక లైసెన్షియేట్సు గాని—ప్రతి గ్రామానికీ ఒక్కొక్కరు చొప్పున కావాలంటే అదికూడా ఎప్పటికి నెరవేరుతుందో చెప్పలేము.

ప్రస్తుతం ప్రభుత్వంకూడా లైసెన్షియేటు కోర్సులు రద్దుచేసి, డాక్టర్లనందరినీ గ్రాడ్యుయేట్సుగానే తయారు చేయాలనే సంకల్పిస్తోంది-మంచిదే కాని వేలకు వేలు ధనము ఖర్చుచేసి, శ్రమపడి చదువుకొని ఏవిధమైన సౌకర్యాలు గాని, సర్వసమర్థమైన ఆసుపత్రులు గాని, తృప్తికరమైన జీతాలుగాని ఏవిధమైన అవకాశాలుగాని లేని పరిస్థితులలో గాడ్యుయేట్సు పల్లెటూళ్ళకు వచ్చి వైద్యసేవ చేసేరోజులు ఎప్పటికి వస్తాయో వూహించుట కష్టము. సౌకర్యములన్నీ కలుగజేసి, ఎక్కువ జీతాలు ఇచ్చి డాక్టర్లను గ్రామాలకు పంపినప్పటికీ, వారివల్ల బీదలకు వైద్య సహాయం-మందులు, ఎంతవరకు అందుబాటులో ఉంటాయో చెప్పలేము. దీనికి ముఖ్యకారణం ఏమంటే, సాధారణంగా గ్రామాలలో డాక్టర్లను లోబరచుకొని ఆయా ఆసుపత్రులలోని మందులు వగైరా తమ తమ స్వంతానికి ఎక్కువ ఉపయోగపడేటట్లు చేసుకొనగలిగే పెత్తనదార్లుంటారు. వారిమాట వినకపోతే, డాక్టర్లమీద పిటీషనులు లేకపోతే ఏ ట్రాన్సఫరో లేక "పూస్టింగో" ఇప్పిస్తారు. ఈ విధంగా వుంటే బీదసాదలకు మందు లెక్కడొస్తాయి? అందుచేత ముఖ్యంగా బీదసాదలకు మిగిలిన వారికీ కూడా తగిన వైద్యసౌకర్యం కలగాలి అంటే-డాక్టర్లకు రోగులకు మధ్య డబ్బు గొడవవుండకూడదు. మందులు కావలసినవన్నీ అనగా సాధారణంగా వచ్చే అన్ని వ్యాధులకు, ఆయా ప్రాంతాల ఆరోగ్య పరిస్థితుల ననుసరించివుండాలన్నమాట. ఈరెండు పద్ధతులు ఏర్పాటుచేయగలిగేన నాడే సరియైన వైద్యసహాయము పల్లెటూళ్లలోని అన్నివర్గాల ప్రజలకు అందుబాటులో వుంటుంది.

ప్రస్తుతం గ్రామాలన్నింటికీ ఆసుపత్రులను డాక్టర్లను ఏర్పాటుచేయ గలిగేటంతి ఆర్థిక స్తోమత మన ప్రభుత్వానికి లేనిమాట నిజమే. ప్రతి సంవత్సరం కూడా, కేంద్రంలోనేమి, రాష్ట్రంలోనేమి, లోటు బడ్జెటు కన్పిస్తోంది. ఆయా లోటులను, అధికపన్నుల ద్వారా, ప్రజలనుంచి రాబట్టుటకే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఏ విధంచేతనైనా, ప్రజలసొమ్ము ప్రభుత్వానికి ప్రభుత్వం సొమ్ము ప్రజలకూ తిరుగుతూ వుంటుంది. ఈ మార్పులలో ఎవరో ఒకరు కొన్నాళ్లకు లాభం పొంది నిల్వలో వుంటుంటారు. నిలవ వున్నవారి వద్దనుంచి రెండవవారుపొందటానికి ప్రయత్నిస్తుంటారు. ఇదిమామూలుగా నడిచే ఒకరకమైన ధనచక్రం లాంటిది.

వైద్య సౌకర్యాలకు ఖర్చుపెట్టే సొమ్ము కూడా ప్రజలనుంచి ఏదోవిధంగా రాబట్టబడినదే. అయితే నీటి పారుదల వగైరా పనులకు ప్రభుత్వధనం ఖర్చుచేయబడినా-తిరిగి భూమిశిస్తు-నీటి తీరువ మొదలైన పన్నుల ద్వారానో ప్రభుత్వానికి కొంతడబ్బు లభిస్తుంది. కాని ఏబాపతు డబ్బు ఖర్చు చేసినా వైద్య సహాయం - ఆసుపత్రుల ద్వారా తిరిగి ప్రభుత్వానికి లభించేదేదీ లేదు. ఎంత ఖర్చుపెడితే అంతా ఖర్చు అయిపోతూవుంటుంది. ఆ కారణంగా, లక్షలాది కోట్లాది డబ్బు ప్రభుత్వ నిలవల్లోంచి వైద్య సౌకర్యాలకు ఖర్చు చేస్తూ, ఆ సొమ్ముకు తిరిగి ప్రజలనుండి మరేయితర పన్నులద్వారానో రాబట్టుకూడా - కావలసినంత వైద్యసహాయము ప్రజలకు అందజేయలేని పరిస్థితులలో వుంటేకంటే-అసలు ప్రభుత్వం సొమ్ముఖర్చు చేయనవసరంలేకనే ఏ గ్రామానికాగ్రామం సమిష్టిగా వైద్యాలయాలు ఏర్పాటుచేసుకునే పద్ధతి ఏర్పాటుచేస్తే పైచెప్పిన రెండు రకాలుగానూ కూడా సరియైన పరిస్థితులలో వైద్య సహాయం లభిస్తుంది.

మొట్టమొదటగా ఒక ప్రణాళికను తయారుచేసి, దానిని శాసనరీత్యా అమలు జరుపవలసి వుంటుంది. ప్రతి గ్రామానికీ ఆసుపత్రి కమిటీ అని ఒక గ్రామములోని తెలివైన విజ్ఞానవంతులైన యువకులద్వారా ఏర్పడాలి. ఈ కమిటీని ఎన్నిక ద్వారా కాకుండా-వ్యక్తుల సామర్థ్యము-సేవానిరతి ననుసరించి జిల్లాకలెక్టర్ల హోదాలోనున్న అధికారులు నామినేటుచేసిన వ్యక్తులతో ఏర్పాటుచేయవలసి వుంటుంది. ఆ కమిటీకి తగిన అధికార హోదాలు ప్రభుత్వం కల్పించాలి

ఈ కమిటీ ద్వారా ధనసేకరణ ఆయా గ్రామములలోని జనాభా ననుసరించి మాత్రమే గాక రాబడినుండి (అనగా వ్యక్తుల ఆదాయము నుంచి) కూడా జరగాలి. ఉద్యోగులకు వారి వారి హోదాననుసరించి, వైద్య సహాయము నకయేఖర్చు ప్రస్తుతం ప్రభుత్వమే భరించే యేర్పాటుంది. ఆయా మందుల కయేఖర్చును కమిటీకే ప్రభుత్వం అందజేయవచ్చును ఇది గ్రామాలలోని ప్రభుత్వోద్యోగులు-ఉపాధ్యాయులు-గుమస్తాలు-ఇతర వృత్తులలోని వారు వారివారి ఆదాయానుసారము చెల్లించే ఏర్పాటుగా నుండును. ఈ విధంగా వసూలైన సొమ్ము కమిటీ తరఫున బ్యాంకులో డిపాజిటుగా వుంటుంది. ఈ కమిటీలు ఏర్పడిన మొదటి సంవత్సరంలో కొంచెం అదనంగా వసూలు చేయవలసి వుంటుంది. ప్రభుత్వం కూడా కొంత ధన సహాయం చేయాలి (కమ్యూనిటీ ప్రాజెక్టు ద్వారా నైనా సరే) ఆ ధనంతో ఒక ఆసుపత్రి భవనము-డాక్టరుకు తదితర సిబ్బందికి నివాస గృహములు ఏర్పరచాలి. లేదా ఒక్కొక్కటి ఒక్కొక్క సంవత్సరములో ఏర్పాటు చేసుకోవాలి.

మిగిలిన డబ్బుతో ఆసుపత్రికి కావలసిన పరికరములు మందులు వగైరాలని కమిటీకి సంబంధించిన మెడికల్ స్టోర్సులో-అనగా ఆసుపత్రి భవనంలోనే-ఒక భాగంలో కమిటీ ఆధ్వర్యాన వుంచాలి. కమిటీ ఏర్పాటు చేసిన ఒక క్వాలిఫైడ్ కాంపౌండరు ద్వారా రోగులకు మందులు సరఫరా అయేటట్లుచూడాలి.

ప్రతి రోజూ రోగులు డాక్టరు చే పరీక్ష చేయించుకొని చీటి ప్రకారం వారికి కావలసిన మందులు స్టోర్సులోని కాంపౌండరు వద్ద ఉచితంగా తీసుకోవాలి. అక్కడ ఒక రిజిస్టరులో మందు తీసుకున్న వారు చేవ్రాలు చేయాలి. దానివలన మందులన్నీ డాక్టరు చేతిలో వుండనక్కరలేదు. తగు నిబంధనలతో డాక్టరువద్ద అత్యవసరమున నుండవలసినవి మాత్రముంచవచ్చును. కొన్ని ప్రమాద భరితములకు వ్యాధులకు ఈ స్టోర్సులో నిలవచేయుటకు కూడా మించిన ఖరీదు కలవి కావలసిన యెడల వారి వారి శక్తి ననుసరించి ఎవరికి వారు స్వంతఖర్చులపై తెచ్చుకోవచ్చు. ఆ విధంగా స్వంత ఖర్చుపై తెచ్చుకో లేక, ఎక్కువ ఖరీదుగల మందులుపయోగింపవలసి వచ్చిన కడు బీదల వ్యాధులకు-కమిటీ చర్చించి కొంత సొమ్ము సహాయం చేసే ఏర్పాటుండాలి. ఇందలి ముఖ్య విషయమేమంటే ఆసుపత్రికి, డాక్టరుకు, సిబ్బందికి, గృహములు మొత్తము యీనట్లు ఒకే పర్యాయము అమరక పోయినను, అపుడపుడు సామానులు - ఫర్నిచరు వగైరా మంగలు మాత్రము, ముఖ్యమైనవిగాన, ముందుగానే ఒకే పర్యాయము కావలసి వుండును. ఏ యే గ్రామాలలో ఈ కమిటీలు ఏర్పడి, ఆసుపత్రులు నిర్వహింపబడుచున్నవో-ఆయా గ్రామాలలో - జిల్లా బోర్డుల, ప్రభుత్వ-మరే యితర సంస్థ ద్వారా నైనా ఏర్పాటు చేయబడిన ఆసుపత్రులుంటే వాటిని ఈ కమిటీలకు సర్వహక్కులతోను అప్పగించి వేయాలి. దీనివలన ప్రభుత్వానికి, తదితర సంస్థలకూ చాలా సొమ్ము కలిసివస్తుంది.

ఈ కమిటీల వలన యిప్పటికే అధిక పన్నుల భారంతో కృంగిపోతున్న ప్రజలకు మరింత కష్టమై సరిగా నిర్వహింపబడవేమో అనే అనుమానముంటే ఈ కమిటీవల్ల వసూలైన ధనముతో గ్రామాలలోని ఆసుపత్రులు నిర్వహింపబడతాయికనుక-తద్వారా ప్రభుత్వానికి కలిసి వచ్చే ధనములో కొంత (ఏ సాలుకో వంతో) ప్రజల అధిక పన్నును నుంచి తగ్గించబడినా - ఆ విధంగా తగ్గించినట్లు ప్రజలకు తెలియ బరచడము చేస్తే బాగుంటుంది. ఈ బాధ్యతే గ్రామ పంచాయతీలకు అప్పగించిన యెడల అనేక సమస్యలతో తీరికలేక బాధపడే పంచాయతీలు - ఒక ఈ కమిటీ బాధ్యతలను కూడా మీద వేసుకొని నిర్వహించుట చాల కష్టము.

బీదలకు ప్రస్తుతం ఏ విధమైన చికిత్సా సౌకర్యం లేదనే చెప్పాలి. ఏదో చిన్న వ్యాధులకు మినహా గ్రామాలలోని బీదలకు వచ్చే ప్రమాద వ్యాధులకు వైద్యసహాయంలేక ఎందరో మృత్యువాత పడిపోతున్నారు. గ్రామాలలో రోగులకు డాక్టర్లకు మధ్య డబ్బు వ్యవహారం లేకుండా చేయాలి. ఈ డాక్టర్లను సద్వినియోగం చేసుకోవాలి అంటేనూ - బీదలకు ప్రత్యేక వైద్య సౌకర్యం కల్పింపబడాలంటేనూ ఈ కమిటీల ద్వారా నే పని జరిగించవచ్చును

గ్రామ కట్టుబాట్లు - నిర్వహణ శక్తి సామర్థ్యముల ననుసరించి ఈ ఆసుపత్రులనూ ఎంత పెద్దవిగానైనా వృద్ధిచేసుకొనవచ్చును.

ఇటువంటి గ్రామ సమిష్టి వైద్యాలయాలలో తక్కువ డబ్బుతో ఎక్కువ వుపయోగించే రీతిగా కొన్ని ఆయుర్వేదౌషధములు కూడా వుండాలి కనుక, కేవలం అల్లోపతీ డాక్టర్లుగాక - ఆయుర్వేద వైద్యవిధానం కూడా తెలిసిన డాక్టర్లవల్ల ఎక్కువ ఉపయోగం వుంటుంది.

ఈ సమిష్టి వైద్యాలయాలలో క్వాలిఫైడ్ డాక్టర్లు అనగా గ్రాడ్యుయేట్సుగాని లైసెన్షియేట్సుగానీ రావాలంటేను-వారు మనస్ఫూర్తిగా పని చేయాలంటేనూ - జిల్లాబోర్డు రూరల్ ఆసుపత్రులలోని జీతాలవలె గాక - సరిపడిన జీతం అనగా ప్రారంభంలో రు 250 లు మొదలు రు 400 ల వరకు వుండాలి. ఈ విధంగా డాక్టర్లకు గృహవసతి ఏర్పాటుచేసి ఉదారంగా సరిపడిన జీతం యిస్తేనేగాని డాక్టర్లను పొందుట కష్టము. ప్రస్తుతం ప్రభుత్వం ఈ తక్కువ జీతాలువలనే డాక్టర్లను గ్రామాలకు ఆకర్షించలేకపోతోంది. జీతాలు ఎక్కువ చేయలేమంటోంది. పైగా డాక్టర్లను గ్రామాలకు వెళ్ళవలసిందిగా నిర్బంధిస్తామని అనడం కూడా జరుగుతోంది. అయితే డాక్టర్లు చేసే సేవ కేవలం శారీరకం కాదు. ఎక్కువగా మనస్సుతో ఆధారపడివుంది. శాసనం ద్వారా డాక్టర్లను గ్రామాలకు పంపినా, తగిన జీతాలు లేకపోతే సంతృప్తికరంగా ప్రజలకు వైద్యసేవ జరుగకపోవచ్చును. కాబట్టి ఈ గ్రామాలకు సమిష్టి వైద్యాలయాలు కావాలంటే డాక్టర్లకు జీతాలు విషయంలో లోపము ఎంతమాత్రం కూడదు. చిన్న గ్రామాలైతే 2, లేక మూడు గ్రామాలు కలసి వుమ్మడిగా ఒక ఆసుపత్రిని ఏర్పరచుకోవచ్చు.

# వేసవి సెలవుల్లో విద్యార్థుల విధులు

### శ్రీ కే. నారాయణరావు

ప్రతి దేశ స్వాతంత్ర్య సమరములోను విద్యార్థులే ముందు నిలబడినారు. మన దేశ స్వాతంత్ర్య మహోద్యమములలోకూడ విద్యార్థుల పాత్ర శ్లాఘనీయము. ఆంధ్రరాష్ట్ర సాధన మొదలగు ఉద్యమములలో విద్యార్థులది ప్రముఖ పాత్ర. స్వాతంత్ర్యమును సంపాదించుటలోనే గాక, వచ్చిన స్వరాజ్యమును నిలబెట్టుకొనుటకు, ప్రజాపరిపాలన సక్రమముగా జరుగుటకు, ప్రజాస్వామిక సోషలిజాన్ని స్థాపించుటకు దేశాభ్యుదయానికి కృషి చేయవలసిన బాధ్యత విద్యార్థులమీద కూడ వున్నది.

దేశ పురోభివృద్ధికి పాటుబడవలసిన, దేశక్షేమాన్ని చూడవలసిన మన నాయకులు ప్రతిరోజూ ఒకరినొకరు విమర్శించుకుంటున్న సంగతి తెలిసినదే. ప్రభుత్వమువారు ప్రతి పక్షాన్ని, ప్రతిపక్షమువారు ప్రభుత్వమును విమర్శించుచూ కాలాన్ని వెళ్లబుచ్చుతున్నారు. ప్రజాశ్రేయస్సును, దేశపురోభివృద్ధికి నిర్మాణాత్మకముగా పనిచేయవలెనను విషయమును మరచిపోతున్నారు. ఎన్నికలలో కనపడి ఓట్లు అడిగి గెలుస్తారు. మరల తిరిగి ఎన్నికలకు గ్రామాలుచేరుతారు. తిరిగి ఎన్నికలు వచ్చే వరకు అచటి ప్రజల అవసరాలేమిటో, వారి యిబ్బందులేమిటో గ్రామపరిస్థితు లెట్లున్నవో కనీసము తెలిసికొనుటకైనా ప్రయత్నించరు. విద్యార్థులు భావిభారత పౌరులుగాన దేశపురోభివృద్ధికి నిర్మాణయుతంగా పనిచేయాలి.

నేటి విద్యార్థులు రేపటి పౌరులు మాత్రమే కాదు, భావి తాయత పౌరులు, నాయకులు కూడా. ముఖ్యందు తమపై బడనున్న బాధ్యతల నిర్వహణకు విద్యాలయాల్లో విద్యాభ్యాసం గాలు కొనసాగిస్తూనే అయత్తం కావాలి. చదువులుమాని రాజకీయాల్లో మునిగితేలాలని యెవరూ వాంఛించరు. కాని కేవలం పుస్తకాలలోనే మునిగి తేలకుండా, పరిసర ప్రపంచంతో సన్నిహిత సంబంధాలనుకల్గి వుండాలి. రాజకీయ పరిణామాలను గమనిస్తూ, ఆర్థికాభ్యుదయాన్ని అనుభవానికి తెచ్చుకుంటూ, సాంఘిక సమస్యల సమన్వయాన్ని అర్థం చేసుకోవాలి. తీరిక సమయాల్లో అభాగ్యులకు తమ విజ్ఞానాన్ని పంచియిస్తూ, నైతికాన్ని ఉత్తేజాన్ని వారిలో కలిగించడానికి ప్రయత్నించాలి. ఒక విద్యార్థి ఈనాడు కళాశాలలో చదువుకుంటున్నాడంటే, తనకో అవకాశం కల్పించినందుకు అతడు సమాజానికి ఋణపడి వున్నాడన్నమాట.

విద్యార్థులలో చాలావరకు గ్రామాలకు సంబంధించినవారే. వారు శెలవు దినములలో తమ గ్రామములందు రాత్రి పాఠశాలలు, కమ్యూనిటీ ప్రాజెక్టులూ, జాతీయవిస్తరణ కేంద్రాలు, గ్రామ పారిశుద్ధ్యము, విజ్ఞాన ప్రబోధము మొదలైన విషయములలో శ్రద్ధవహించి దేశ పురోభివృద్ధికి తోడ్పడాలి.

## గ్రామాలు

దేశములో దాదాపు ఆరులక్షల గ్రామాలున్నాయి. పల్లెటూళ్ళు బాగా వుండిన దేశము సిరిసంపదలతో తులతూగును. దేశము శరీరమువంటిదైన గ్రామము హృదయమువంటిది. హృదయము చక్కగా పనిచేస్తూ ఆరోగ్యవంతముగా నున్నచో దేహము ఆరోగ్యముగనూ, బలిష్ఠముగనూ వుండును.అట్లే గ్రామము పాడిపంటలు, ధనధాన్యములతో విలసిల్లుచున్నచో దేశమభివృద్ధి మార్గాన నడచును. అందుకే మహాత్మాగాంధీగారెల్లప్పుడూ గ్రామ పునర్నిర్మాణమును గూర్చి చెప్పుతుండేవారు. కాంగ్రెసు సభలలాంటి పెద్ద సమావేశాలను గ్రామాలలో జరిగేటట్లు చూసేవారు. పూర్వము గ్రామములు కావలసిన పదార్థములకు ఇతర గ్రామములు, నగరములమీద ఆధారపడక స్వయంపోషకములై వుండేవి. కాని ప్రస్తుతము ఆవిధముగా లేవు. గ్రామములలోని చేతివృత్తులు అభివృద్ధిచెంది వాటికి పూర్వస్థితి కలుగునట్లు చేయవలసినబాధ్యత విద్యార్థులమీద వున్నది.

కాయకష్టం విలువనూ, గౌరవాన్ని రక్షించాలి. కమ్యూనిటీ ప్రాజెక్టులూ, సామాజిక వికాసకేంద్రాల కార్యక్రమాల్లో పాల్గొని నిర్మాణాత్మక కృషికి దోహదమివ్వాలి. తమ తమ గ్రామాల్లో విద్యార్థులంతా కలసి ప్రజా సహకారాన్ని సంపాదించి, రోడ్లు వేయటం, రోడ్లు వూడ్వటం, సమిష్టి అవసరాలకు భవనాలు నిర్మించటము, ఉద్యానవనాలు పెంచటం, ఆటస్థలాలను తీర్చి దిద్దటం మొదలైనపనులు సాగించాలి. కమ్యూనిటీ ప్రాజెక్టుల సెంటర్లు దేశంలో చాలా వున్నవి. వాటిలో పాల్గొనేందుకు విద్యార్థులకు చక్కటి అవకాశాలున్న సంగతి చాలామందికి తెలియదు సెలవు దినములలో విద్యార్థులు కమ్యూనిటీ ప్రాజెక్టులలో పనిచేయుటకు ప్రయాణ సౌకర్యములు, సెంటర్లదగ్గర భోజనవసతులు వున్నవి. అట్లు ప్రయాణముచేసి ఇతర చోట్ల పనిచేయుటకు వీలులేనివారు, తమ తమ గ్రామములలోనే జాతీయ విస్తరణ కేంద్రాలలో పనిచేయవచ్చు. విద్యార్థు లిట్లు పనిచేయుటవల్ల ప్రజా ప్రభుత్వమునకు ధనము మిగులును. విద్యార్థులందరూ ఒకచోట కలసి పని చేయుటవల్ల సంఘీభావము పెంపొందును. మన జాతీయ ప్రభుత్వము కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయవిస్తరణ కేంద్రాలు మొదలగు వాటిద్వారా దేశపురోభివృద్ధికి కృషి చేస్తున్నది. రోజు రోజుకు దేశంలో వీటి సంఖ్య పెరుగుచున్నది. వీటి ప్రాముఖ్యము హెచ్చుతున్నది. కమ్యూనిటీ ప్రాజెక్టులు మొదలగు చోట్ల పనిచేయుటకు వివిధ ప్రదేశములను దర్శించుటవలన అచటి ప్రజల ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను, వేషభాషలను తెలిసికొనవచ్చును. పై విధముగా పనిచేయదలచిన విద్యార్థులు కమ్యూనిటీ ప్రాజెక్టులు, భారత సేవక్ సమాజ్, సోషల్ సర్వీస్ లీగ్, జాతీయవిస్తరణకేంద్రాల శాఖలు మొదలగు సంస్థలద్వారా అన్నివిధము లయిన సహాయసహకారములను పొందవచ్చును.

గ్రామారోగ్యము, గ్రామపారిశుద్ధ్యము విషయములలో విద్యార్థులు యెక్కువ శ్రద్ధవహించాలి. గ్రామ పెద్దలు, నాయకులు ముఠాతత్వము, కక్షలు పెంచుకొని గ్రామారోగ్యము, గ్రామాభివృద్ధి మొదలగు విషయములను మరచిపోవుచున్నారు. గ్రామ పారిశుద్ధ్యమును బాగుచేయుటకు విద్యార్థులు ముందడుగు వేయాలి.

విద్యావిషయమున మనదేశము చాలా వెనుకబడివున్నది. ఇతర దేశాలలో నూటికి 90 నుండి 97 వరకు విద్యావంతులుండగా, మనదేశములో షుమారు 18 మంది మాత్రమే విద్యావంతులున్నారు. ఈ అవిద్యను రూపుమాపటానికి విద్యార్థులు నడుము కట్టాలి.

రాత్రి పాఠశాలలు నడిపి సోదరులను విద్యావంతులుగా తయారుచేయుట విద్యార్థులకు యేమంత కష్టమయిన పని గాదు. ప్రభుత్వమువారు వయోజనవిద్య ను గురించి కొన్ని కేంద్రములలో కొన్ని తరగతులు నడిపి, సర్టిఫికేటు యిస్తారు. విద్యార్థులు వాటికి హాజరయి సర్టిఫికేట్లు పొంది సెలవుదినములలో వారి గ్రామములందు రాత్రి పాఠశాలలు నడిపి నూటికి నూరు మందినీ విద్యావంతులుగా తయారుచేసి దేశాభ్యుదయానికి తోడ్పడాలి. ఈ రాత్రి పాఠశాలలకు ప్రభుత్వము వారిచే సహాయము పొందవచ్చును. విద్య అంటే అక్షరాస్యత మాత్రమే కాదు. అక్షరాస్యత విద్యార్జనకొక చక్కని సాధనము మాత్రమే. తమ బాధ్యతలను, హక్కులను గుర్తింపజేసే విజ్ఞానమే విద్య. అట్టి విద్యను అందించటానికి అందుబాటులోవున్న సాధనాలన్నీ వినియోగించాలి. నిరక్షరాస్యులకు పత్రికలు, గ్రంథాలు చదివి వినిపించటంద్వారా, నాటకాలు, బుర్రకథలు మొదలగు వైజ్ఞానిక ప్రదర్శనాల ద్వారా చిత్ర సంగీత, నాట్యకళల ద్వారా ప్రజలలో విద్యావిషయకముగా విజ్ఞానవ్యాప్తి సాధించవచ్చు.

పౌరులకు బాధ్యతలలో పాటున్న హక్కులను వివరించవలసిన బాధ్యత విద్యార్థులమీద వున్నది. గ్రామాలలోని కొందరు ఓటును దుర్వినియోగ పరచుచున్న సంగతి విదితమే. అట్టి వారికి ఓటు విలువను గూర్చి నచ్చచెప్పాలి. విద్యార్థులు శెలవు దినములలో వారి గ్రామములందు ఈ క్రింది విషయములలో శ్రద్ధ వహించాలి. వ్యాపారులకు, రైతులకు దేశంలోని వివిధ వస్తువులకు వివిధమార్కెట్లలో వున్న ధరలను ఎప్పటికప్పుడు తెలియచేయాలి. రైతులకు క్రొత్తపంటలను గురించి యితర దేశపు వ్యవసాయ పద్ధతులను గురించి, తక్కువ పెట్టుబడులతో ఎక్కువ పంట పండించు పద్ధతులను గురించి బోధించాలి. వార్తాపత్రికల సహాయముతో గ్రామవాసులకు రాష్ట్రములోని దేశములోని, ప్రపంచములోని రాజకీయ పరిస్థితులను తెలియజేయాలి. ఆరోగ్యసూత్రములను గూర్చి, చదువు ప్రాముఖ్యమునుగురించి తెలియ జేస్తూ ఉండాలి.

వినోబా భావే, జయప్రకాశ్ నారాయణ్‌లు చేయుచున్న మహత్తర కార్యము 'భూదానోద్యమము' ప్రాముఖ్యతను గూర్చి విద్యార్థులు గ్రామవాసులకు తెలియజెప్పి, భూదానోద్యమము, సంపత్తిదానము మొదలగు సాంఘిక సేవా కార్యక్రమాలలో పాల్గొనాలి. గ్రామములలో యీ రోజుకు కులాలనుబట్టి, ఆర్థికస్థితినిబట్టి తారతమ్యమున్నది. ఇప్పటికీ కొన్ని గ్రామాలలో పెద్దకులస్థుల బజార్లలో చిన్న కులస్థులు చెప్పులు, గొడుగులతో నడువరాదను ఆచారమున్నది. అట్లు లేకుండా సమానత్వము యేర్పడునట్లు విద్యార్థులు పాటుపడాలి. గ్రామాలలో వుద్యోగస్థులు లంచాలు తీసుకొనుట, బీదప్రజల కన్యాయము చేయుట మొదలగునవి జరిగినప్పుడు వెంటనే వాటిని పై అధికారులకు తెలియజేయాలి. విద్యార్థులు సాంఘిక సంస్కరణల ప్రచారానికి పూనుకోవాలి.

## సౌదర్యం

(7 వ పేజీ తరువాయి)

లుగా మారుతై. భాగవతగాదా భారత యుద్ధమైంది. సుగ్రీవుడు వాలి హతమయిందాకా, విభీషణుడు రావణుడు నేలబడ్డదాకా నిద్రపోయిన వాళ్ళు కారు.

అయితే ఒకరిలో దౌష్ట్యం ఉత్కటమై మితిమీరిన వేళ రెండవవారు సహనముయొక్క అవధిని దాటవలసివచ్చి యుద్ధానికి దిగడం చూస్తుంటాం. కను కనే 'దాయాదితత్వం' అనేమాటుక ఉంది. 'భ్రాతృవ్య' శబ్దం శత్రువనే అర్థాన్ని ఇస్తుంది. ఇక్కడ ఒకరి సంపత్తిని ఒకరు అపహరించాలనియత్నించి ఆమోహంలో ద్రోహాన్ని పెంచుకుని శత్రువులుగా తయారుకావడం జరుగుతుంది. "వెంపస్సు"లో చూడండి. పాపం! దగువులో నిమగ్నుడై ప్రాస్పరో తన గడిదాటి వచ్చేవాడు కాడు. రాజ్యవ్యవహారమంతా తమ్మునికు అంటోనియోకు అప్పగించాడు. పెత్తనం చెయ్యడంవల్ల కన్ను కుట్టింది. తానే ప్రభువు కావాలనుకున్నాడు. అన్నను, అతని మూడేళ్ల ఆడపిల్లనూ-ఇద్దరినీ అర్ధరాత్రి సముద్రతీరానికి తీసుకునిపోయి తెరచాపలు మొదలయినవి ఏవీలేని ఒక చిన్న పడవలో ఉంచి వదిలిపెట్టాడు. అపడవకు ఒక దారితెన్ను లేదు. సముద్రముయొక్క అనుగ్రహం. మంచినా సరే, ఏవిధ్ధునకన్నా చేర్చినాసరే. అపలట్లా విడిచిపెట్టడంలో ఉద్దేశం-పడవ మునిగి వాళ్ళు చచ్చిపోవాలని. తమ్ముడుగదా అని పెత్తనం ఇచ్చినందుకు చేసినపని ఇది ఇట్టి సౌదర్యంగూడా మనకు లోకంలో ప్రత్యక్షమౌతుంది.

మనవాళ్లు సభలలో వేదికమీదికెక్క 'సోదరులారా!' అనడం మామూలు. 'బ్రదర్' అని ఒకరినొకరు సామాన్యంగా అనుకోవడం వింటుంటాం. సర్వ మానవసౌభ్రాతృత్వాన్ని సాధించడానికి ఇప్పుడు ప్రతిదేశం పాటుపడుతున్నట్లు చెప్పుకుంటున్నది.

లాంగ్‌ఫెలో కవి వ్రాసిన కథానిక చూడండి. అబుల్లా అహమద్ అనే ఇద్దరన్నదమ్ములున్నారు; రైతులు. అబుల్లాకు పెళ్లాం పిల్లలున్నారు. అహమద్ ఒంటరివాడు. పొలంపని చేసి పంట పండించారు. పంట, గడ్డిమోపులు కట్టి చేలల్లో కుప్పలుగా ఉన్నది. వేరువేరుగానే కాపరాలు. ఎవరి ఇంట్లోవాళ్లు పడుకొని ఉన్నారు. ఒక రాత్రి. అబుల్లా పక్కమీద లేచి కూర్చొని అనుకున్నాడు.

'నా తమ్ముడు ఒంటరివాడు. అతనికి సంతోషంలేదు. నేను పోయి వాడి పంటగడ్డిమోపులతోపాటు నా మోపులు రెండు చేర్చివస్తాను. ఇది అతనికి తెలియరాదు' అని నిశ్చయించి, రెండు మోపులు తమ్ముడి మోపుల్లో పడేసివచ్చాడు.

అహమద్ కూడా అదేరాత్రి తన పక్కమీదనుంచి లేచి కూర్చొని అనుకున్నాడు 'మా అన్న పిల్లలుగలవాడు. సుఖం తక్కువ. అతడి మనస్సు సంతోషించడానికి నా గడ్డిమోపుల్లో రెండు అతని వాటిల్లో వేసివస్తాను' అని నిశ్చయించి రెండు మోపులు తవది అన్న మోపుల్లో పడేసి వచ్చాడు. ఇట్లా ఇద్దరూ కొన్నాళ్లు చేస్తూ వచ్చారు. ఒకడు చేసే సంగతి ఇంకొకరికి తెలియదు. కాని, ఎంత చేసినా, ఇద్దరి మోపులు సమానంగా ఉండడం. చూచుకొని, ఎవరికివారు ఆశ్చర్యపడుతున్నారు. రాత్రిళ్లు చేసినపని పగలు పరికించి చేస్తే కలవలె ఉన్నది. కాని, నిజంగా చేసిన పని ఫలితం ఏమిటి?

Their sheaves were equal,
for their hearts
In love equal too.
When this tale to him was
brought
The caliph did decree;
Where twain had thought
the same good thought
There Allah's house should
be.

(ఇరువురి మోపులు సమానంగా ఉన్నయ్యంటే, ఇరువురిలో ప్రేమ సమానంగా ఉంది. కలీఫా ఈ సంగతి విన్నాడు. 'ఇద్దరి హృదయాలలో మంచిభావముంటే అక్కడ ఈశ్వరుని ఆలయం ఉన్నట్టే' అన్నాడు.)

నా తమ్ముడు చచ్చిపోయినాడు. పులిజాల హనుమంతరావు అన్న చచ్చిపోయినాడు. నాకు శ్రీకృష్ణదేవరాయల గ్రంథాలయంలో సన్మానం జరిగిననాటిరాత్రి సభ అయిపోయిన తర్వాత సుల్తాన్‌బజారులో ఇద్దరం నడుస్తున్నాం. అతడన్నాడు 'మీ తమ్ముడి నేను; నా అన్న మీరు. మీరు తమ్ముడు లేడనుకోవద్దు. నా అన్న బతికివున్నాడు అనుకుంటూను' అని. మా యిద్దరి కళ్ళ వెంట నీళ్లు తిరిగాయి కాసేపు. సన్మానంవద్దంటే రాయప్రోలు అతను ఆలోచించి తిట్టిపెట్టారు.

మా హనుమంతరాయ డన
మానకశారసపానముత్త దే
యానాకు ఐక్యదై తలకడో
యిటుసేయగ నన్ను ఘోరవా
దాహవరంగ మీ కవుల
యాగపుమన్న వినంగు రచ్చకున్
బాహువులు పట్టి లాగ నిది

భావ్యముకాదని యెంత చెప్పినన్.
కాబట్టి మనం కొందరు సర్కారవాళ్ళనీ కొందరు నిజామీయులనీ అనకోవలసిన దుష్టగ్రహాలు తొలగినవి మన వైభవాన్ని తలచుకొని విద్యానాథుని-
రేరే ఘూర్జర జర్జరోఽసి సమరే
లంపాక కిం కంపసే
వంగత్వంగసి కిం ముధా బలదజః
వాణోఽసి కిం కోంకణ
హమ్మీరాణపరాయణో భవ
మహారాష్ట్ర పరాష్ట్రోఽస్యమీ
యోద్ధారో వయమిత్యరీ నభిదధం
త్యాంధ్ర క్షమా భృద్భటాః—

అన్న శ్లోకాన్ని స్మరించాలనీ, ఆంధ్రభూమిని ధరించే భటులం కావాలనీ, ప్రతివాడు 'ఆంధ్రోఽహం' అనుకోవలసినవేళ వచ్చిందనీ, రామలక్ష్మణ సౌదర్యం మనలో రాణించాలనీ నా అభివాంఛితం, అభ్యర్థనం.

